

# ఆహారోన్ముఖము



ప్రణాళికలో బృహత్ సాధితములందు ఒకటి ఆహారోన్ముఖము. మేము ఈ ప్రణాళికను ప్రారంభించినప్పుడు దేశమున దుర్భిక్షము తీవ్రముగా ప్రబలియుండెను. 1956 సంవత్సరాంతమునకు ప్రణాళిక ప్రకారము ఉత్పత్తిలో 76 లక్షల అధిక్యతను లక్ష్యముగా ఏర్పరచుకొనెను. మూడు సంవత్సరముల లోపుగనే ఈ లక్ష్యమును 114 లక్షల టన్నులు అదనపు ఆహార ధాన్యములతో అధిగమించితిమి. 1954-55 సంవత్సరములోగూడ అభివృద్ధి చూపబడినది. అదనపు ఆహారోత్పత్తి మరి 2 లక్షల టన్నులు పెరిగినది.

పూర్తింపదగిన ఈ సంసిద్ధి అధికాహారోత్పత్తి ప్రచారము వలనను, సకాల ఋతుపవనముల వలనను, అభివృద్ధి విధానపు వ్యవసాయమువలనను, నీటి పారుదలకుగల ఎక్కువ సదుపాయముల వలనను కలిగినది. సువైశాల్య ఘుంగు భూములు పునరావాస్త కాబడినవి. కాలువలు త్రవ్వబడినవి. నూతులు తీయబడినవి. ఆహారములపై శేషవింగువంటి నిబంధనలు తొలగింప బడినవి.


ZANDU
GRIPENOL
CONTAINS NO NARCOTIC

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] జనవరి 1956 [సంచిక ౧

# వి ష య సూ చి క





మధ్యన కూర్చున్నవారు కీ॥ శే॥ మాధవి అమ్మగారు. ఆమె కుడిప్రక్కన కుమార్తె శ్రీమతి శారదాదేవి, ఎడమ ప్రక్కన చెల్లెలు శ్రీమతి కాత్యాయని అమ్మ, నిల్చున్నవారు అల్లుడు డాక్టరు బాలకృష్ణ నెడుంగాడి, డాక్టరు కే. యన్. కేసరి గారు, చేతుల్లో వసంతకుమారి కలరు.

# గృహలక్ష్మి

జయజయ గృహలక్ష్మి సభ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతికా!
జయజయ లలనా రత్నమా! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## మాతృమూర్తి మాధవి అమ్మగారి నిర్యాణము

పూజ్యబాబు కేసరిగారిని ఆరాధించి, ప్రేమించి, సేవించిన ప్రతియొక్కరూ శ్రీమతి మాధవిఅమ్మగారి ఉదార హృదయాన్ని యావజ్జీవ పర్యంతము స్మరిస్తారు.

ఆమె పరోపకారి; ప్రజాహితమును ప్రోత్సహించినది. ఆమె ప్రజ్ఞావిశేషాలు, బుద్ధికుశలత ఏ సమస్యనైనా రాజబాటగా వాస్తవికత కనుగుణ్యంగా చేబట్టడానికి వినియోగపడినవి.

పూజ్యబాబు కేసరిగారి నిత్యజీవితంలో నిరంతకుశుడైనా ఆయనను భార్యగా ప్రతిక్షణం అనుసరించి, తన్ను ఆయన అనుసరించేలాగ చేసికోకలిగింది మాధవి అమ్మగారు.

కేసరిబాబుగారి వదాన్యతను, ప్రజాహిత కార్యక్రమాన్ని, కళారాధనను మాధవి అమ్మగారు ప్రోత్సహించి మెరుగుపెట్టింది. భార్యాభర్తల పరస్పర జీవిత ప్రభావములు యీనాడు అనేకమంది వ్యక్తుల జీవితములమీద, సంస్థలమీద ప్రస్ఫుటిస్తున్నవి.

భర్త నిర్మించిన సంస్థలు, భర్త ఆదరాభిమానములతో పురోభివృద్ధిగాంచు చున్నవ్యక్తులు మాధవిఅమ్మగారిలో ఆనంద తరంగాలకు కారణ భూతములగు చుండేవి.

తన మన అను దృష్టిలో ఆమె ప్రేమానురాగములు అనన్యములు. ఆమె సాదర పారమార్థిక చింతతో ఎదటివ్యక్తి ఆకలెరిగి అన్నమిడిన మాతృమూర్తి. మితభాషిణి అయినా వాక్కులు హృదయరంజకములు.

పూజ్యబాబు కేసరిగారు పరమపదించినా ఆమె అపార అనుభవ విజ్ఞతలు, విశాల హృదయముతోటి పురోభివృద్ధిగాంచు మామాతృ సంస్థకు మాధవి అమ్మగారి నిర్యాణం తీరనిలోటు కలిగించింది. అయినా తల్లిదండ్రుల అడుగు జాడలలో నడుస్తూ కేసరిబాబు సంస్థల అవిచ్ఛిన్న వైభవానికి సోదరి శ్రీమతి శారదా దేవి పరిపాలనా నిర్వహణ తప్పక దోహదం చేయగలదు.

భర్తతోపాటు భగవత్సాన్నిధ్యానికి చేరుకున్న మాధవిఅమ్మగారికి భక్తిపురస్సరంగా కృతజ్ఞతతో అంజలి ఘటిస్తూ, భగవంతుడామెకు సుస్థిరమయిన ఆత్మశాంతిని ప్రసాదించి శాశ్వత కైవల్యాన్ని ప్రసాదించుగాక యని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

ఓం శాంతిః శాంతిః శాంతిః



# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ.

## ఉపనిషదులు

(గతసంచిక తరువాయి)

గమ్యస్థానము అకర్మము లేక సన్న్యాసమార్గము అయినను, మృగమానవుడు దైవమానవుడగుటకు మానవ మానవుడను మధ్య దశను, విచక్షణ సంధి దశను అనుభవించిన వెనుక సాధ్యమగుచున్నది. మృగ మానవుడు వికర్మమున కృషిచేయుటవల్ల క్రమేణా సకామ్యకర్మమున నిరంతర తీవ్ర వ్యవహారమువల్ల, పిమ్మట సూక్ష్మతర జీవిత నిష్కామకర్మ వ్యవసాయమువల్ల మానవ మానవుడు అగుచున్నాడు. స్వార్థకార్యములు పరిపక్వమై స్వార్థరహిత కార్యములుగా మారును. స్వార్థరహిత కార్యములు, మానవుని మనసును, బుద్ధిని నిర్మలత్వముగావించి, ధ్యాన మార్గమునకు యోగ్యత కలిగించుచున్నది.

ప్రాచీన శ్రుతిగ్రంథ మూలమునందు కర్మ అను పదము యజ్ఞకార్యములకు మాత్రము అన్వయించబడి యుండెను. పిమ్మట పురాణకాలమునందు ఆ పదమునకు ఆశ్రమ ధర్మములని అన్వయముకలిగెను. మరి నవీనకాలమున, ఈ పదమునకు ఇంకను తేజోవంతమైన అర్థమును కనుపరచి, మన ఉపనిషదు గ్రంథమునందలి భావమున కర్మ అనగా, మనదైనందిన కార్యములన్నియు, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, కుటుంబ ధర్మములన్నియు సూచింపబడుచున్నవని తెలియవలెను. ఇట్టి కార్యములన్నియు, త్యాజ్య భావముతో చేయు వ్యక్తులు ఇట్టి కార్యములవల్ల కలుగు ఫలితములకు వశము కాజాలరు. కాని ఇట్టి కార్యములు, ఫలాపేక్షతో, వాటివల్ల నిర్దిష్టఫలము కలుగవలెను అను అభిప్రాయముతో చేసిన యెడల అట్టి ఫలములు మానవుని బద్ధుని చేయుచున్నది. కనుక మానవుడు జ్ఞానవంతుడైన యెడల, కర్మము, కర్మపూర్తికొరకేయని నిర్మల భావముతో వ్యవహరించవలెను.

ఫలమునందు ఆసక్తి యుండుటవల్ల, మానవునికి కర్మయందు చేయగలశక్తి క్షీణించుటేగాక, అతని మనసునందు కొన్ని భావములు స్థిరపడి, మున్ముందుకు కార్యములు జేయచాలని దుర్బలము, మర్యాద లోపమును కలిగించును. వ్యక్తి భావము తొలగించుటవల్ల ఉద్రేకము కలుగుచున్నది. అట్టి ఉద్రేకమునచేయు కార్యము సామాన్య కార్యమునకన్న వేయిరెట్లు భరింపరాని దృఢత్వము కలిగియుండును. నిర్విఘ్నకార్యదీక్ష వహించుటలోగల సూక్ష్మాంశము ఏమన, కర్త కార్యమునుండి వ్యక్తి భావమును తొలగించుకొనవలెను. ఇచ్చట శ్రుతి, ప్రతి శక్తి సామర్థ్యముగల మానవుడును, నిరంతర నిర్విఘ్న, ఆవేశ భావపూరిత కర్మ వ్యవహారములు చేయుచు, అలసటనుకూడ లక్ష్యముచేయగూడదని బోధించుచున్నది.

చిరకాలము త్యాజ్యభావముతో కార్యవ్యవహారములు చేయుచుండుటవల్ల, మనసునందుగల మలినములను, కోరికలు, మమకారము, ద్వేషము, స్వార్థత, ఈర్ష్య, పేరాశ మొదలగునవి తొలగిపోగలవు. ఇట్లు నిర్మలత్వముగాంచిన మనసు, బుద్ధి సూక్ష్మమును దైవ సంపత్తిపొంది, ఉన్నత తీక్ష్ణ ధ్యానమువల్ల సత్యమార్గమును అనుసరించ యోగ్యత పొందుచున్నది.

శ్రు. అసుర్యానామ తే లోకా అన్ధేన
తమసాఽఽవృతాః
తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే
చాత్మహనో జనాః ॥ 3 ॥

ఆత్మహత్య సలుపు వారందరు ఇచ్చటినుండి అంధకారావృతమై సూర్యరహిత లోకములు చేరుచుందురు. దివ్య జీవితమును నాశనము చేయువారు చేరగల గమ్యస్థానము ఇచట తెలుపబడుచున్నది. ఈ ఉపనిషదు

నందలి విషయ క్రమమున మొదటి శ్లోకమున, సన్న్యాస మార్గ మవలంభించువార్ల గమ్యస్థానము, అందుకు అవసరమగు విధానము, శిక్షణయొక్క వివరమును తెలుపబడుచున్నది. రెండవ శ్లోకమును కర్మమార్గమును తెలుపుటకై ఉపయోగింపబడినది. అనగా ధ్యాన మార్గమును అవలంభింప యోగ్యతలేనివారికి తగిన ఉపదేశములు తెలుపబడుచున్నది. ఇట్లు మహ ఋషులు మానవరాశినంతయు, ధ్యానపరులు, కర్మపరులు అని రెండు తెగలుగా విభజించియున్నారు. జన్మము మెత్తిన మానవ జీవులందరును ధ్యానపరుల మార్గమునునైనను సరే, లేక గొప్ప కర్మపరుల మార్గమునైనను అనుసరించి తీరవలెను. కర్మ చక్కగ నివర్తించినయెడల మానవుడు ఉన్నతదశపొంది, ధ్యాన విధానము నారంభించవచ్చును.

ఇప్పుడు ఒక సంశయము కలుగుచున్నది. ధ్యాన మార్గముగాని, కర్మమార్గముగాని, ఏదియు అనుసరించనివారిగతి యేమగుచున్నది! అట్టివారిని, వారి యొక్క యాత్రను ఈ శ్లోకము వర్ణించుచున్నది. ఉపనిషదుకర్తలు, మానవుడు జన్మమెత్తినవెనుక, వ్యక్తిగా గాని, సంఘముగాని, వర్ణముగగాని, జాతీయముగ గాని, ధ్యానమార్గమునుగాని, లేక తీవ్ర ఉత్సాహ పూరిత నిరంతర కర్మమార్గమునుగాని జీవించని, వ్యక్తిగాని, వర్ణముగాని, ఆత్మ హాత్యులు అని తీర్మానించియున్నారు. అట్టి జాతి వారందరును, అంధకార, భయకంపిత పాతాళమున అవశ్యముపడగలరు. అట్టి వ్యక్తిగాని వర్ణమువారుగాని, విజ్ఞానమున దైవీక సంపదయందు గొప్ప పతనము అనివార్యముగా పొందగలుగుచున్నారు.

ఇట్టి జీర్ణదశ, లేక మరణమువంటి పతనమునకు, ఇచ్చట సూర్యరహిత ప్రపంచము అను రమ్యమైన పదమును వాడబడియున్నది. ఇచ్చట సూర్యరహిత ప్రపంచము అను పురాతన భాషలో, సూన్యము, అర్థము లేనిది అనుటలో, ఇందుగల ప్రాముఖ్యత, ప్రాధాన్యము గమనించలేకపోవుట అనవచ్చును. ఋషుల భాష పురాతనమైనది. నేడు రూపుమాసియున్నది అనినను, అందలి అమరభావములు ఎన్నడును నవీనముగనే, విజ్ఞాన శీలురకు వాఙ్మయ సౌందర్య పరిశోధకులకు అగుపడుచున్నది. సూర్యరహిత ప్రపంచము అనుటలోగల వాక్యార్థము మనలను భ్రమింపజేయవలసిన అగత్యములేదు. మన కాలములోకూడ వాఙ్మయ హీన, జీర్ణదశ పొందిన కొద్ది కొద్ది కాలములను "అంధకారతరము" అని వాడుచున్నాము.

కాలము (Dark ages).

ఒక తరమువారు దివ్యజీవిత విలువులతో నివసించుటకు, విజ్ఞాన సాధనలు ఆలోచించుటకు, అభివృద్ధి మార్గముల నవలంభించుటకు నిరాకరించినను, ప్రపంచమున ఉత్సాహముతో కృషిసల్పుటకు, సంతృప్తిగ ఉత్పత్తి కలిగించుటకు, సరి సమానముగ పంచుటకు సునాయాసముగ సుఖించుటకునైన కర్మ చేసి తీరవలెను. అనగా, ప్రపంచము దివ్యజీవితమున గాని, చక్కని నిర్మాణ పూరిత విషయ జీవితము గాని, విచక్షణాజనిత కార్యకలాపమువల్లనే ఆధారపడియుండగలదు.

ఈ శ్లోకమునందు, మన వర్ణ జీవితమున బాగుగ పరిచితము యియుండు ప్రమాదమును మనకు దృగ్గోచరము చేయ మొదలిడుచున్నది. ఒక వర్ణమువారు ఉన్నత జీవిత గుణములతో వర్తించుటకుగాని, చక్కని అభివృద్ధి గుణములుగల విషయ జీవితము గాని, అనుసరించుటకు ఇష్టపడక పోయినయెడల, అట్టి తరమువారు జ్ఞానమునగాని, మానసికముగగాని, జీర్ణదశపొంది, ఆటవిక క్రూర కార్యములయందు మునిగి యుండగలరు. వారికి అటుపిమ్మట మృగముల వేదాంతము యోగ్యముగా నుండును. అటు పిమ్మట వారి జీవిత వ్యవహారమంతయు, సునాయాసముగ ధన సంపాద్యమునకు అనేక అవకాశములు కోరుట, పూర్తి సోమరితన విరామ కాలము, అంతులేని శెలవుకాలము, మితిమీరిన వంశవృద్ధి, పుట్టిన సంతతికి వీరి పోషక బాధ్యత ఇంచుకైన లేకుండుట, వీటితో పూర్తియైయుండును. ఒక వర్ణమువారి జీవి

తము ఇట్లుండిన, వారు చరిత్రపరిభాషలో "ఆత్మను కోలుపోయిన వర్ణమువారు" అని అవశ్యము తలచబడుచున్నారు. వారు "అంధకార కాలము"న పొందగల దుఃఖరాశిని అనుభవింపగల నాగరికతను ఏర్పరుచుకొనగలిగియుందురు.

ఒక చరిత్రాంశమునందలి సత్యము, ఒక వ్యక్తికి సంపర్కము కలిగిన యెడల ఆ వర్ణములందలి వ్యక్తులందరికి సంపర్కముకలిగియుండును. ఒక వ్యక్తి ఉన్నత జీవితాశయములతో, తన అభివృద్ధియు సంరక్షయు చేసుకొనగల ఉత్తమ కార్యముచేయ నిరాకరించిన యెడల, అతడు విరామములేని, అలసట కలిగించు నిరంతర కృషిచేయు సమకట్టి జాగరూకతతో, తీక్ష్ణ జీవితముతో, ధర్మ నిర్వాహకమును, కోరగల వాక్కులను పూరింపగల జీవితమును అనుసరించ బాధ్యుడగుచున్నాడు. పైన తెలిపిన మొదటి ధర్మముగాని, రెండవ ధర్మముగాని, నెరవేర్చ సమర్థతలేనివ్యక్తి, శవతుల్యుడని, స్థావర స్వరూపుడని, అజ్ఞానమున మునిగిన, మానవ జీవస్వరూప, విషయపూరిత మానవాకార వస్తువని తలచవలసియున్నది. అట్టి వారిని మహా ఋషులు, నడవగలిగిన మానవ శరములని తలచుచున్నారు. ఇట్టి నీచవర్తనులు, వ్రణపూరిత స్వరూపములును, "ఆత్మ హత్య సలిపినవారని" శ్రుతులు వర్ణించుచున్నవి.

శ్రుతి నిర్మాతలగు విజ్ఞాన పురుషులు, "ఆత్మహత్యసలిపిన"–ఇట్టివారు తమ దేహమును వదలిన పిమ్మట సూర్యరహిత ప్రపంచములను చేరుచున్నారని నిర్ణయించగలిగిరి.

ఇందు మూర్పు దిశనందుండు గొప్ప మత ధర్మములన్నియు, పునర్జన్మ సిద్ధాంతమును అంగీకరించుచున్నారను సూచన స్పష్టముగా తెలియుచున్నది. జీవునకు పునర్జన్మము కలదని నిస్సంశయముగా పాశ్చాత్య మత ధర్మ గ్రంథములు తెలుపుచున్నవి. ఇచ్చట ఈ శ్రుతియందు, జీవుడు, ప్రస్తుత శరీరము నశించిన వెనుక ఎట్లు జీవించగలడో సూచన తెలుపుచున్నది.

అహంకారమే స్వరూపముగల జీవుడు, మరణ కాలమున స్థూల శరీరము విడచిన వెనుక, తనకు ముందు కలిగియుండిన అనుభవ ముద్రలవలన ప్రేరేపింపబడుచుండును. మనసు తాను పొందియుండు మునుపటి అనుభవముల ముద్రలనుండి ముందుకు సాగుటకు శక్తి సంపాదించియుండును. ఇట్లు, ఒక వ్యక్తి, మొద్దు భావముతో, స్తబ్ధతపొంది, ఉన్నత ధ్యాన సూక్ష్మ వ్యవహారమున కాని, లేక స్థూల విషయ ప్రపంచ వ్యవహారములలోగాని, పాల్గొనలేక పోయినయెడల ఆ వ్యక్తి హీనదశపొంది మృగప్రాయమగును.

ఇట్లు మనసు, శరీరమునుండి విడివడి, పూర్వవాసనలవల్ల గలిగిన భావానుసారము, ప్రేరేపింపబడి, అధోగతియందు, మృగ ప్రపంచముననో, వృక్ష ప్రపంచముననో, లేక రాళ్ల ప్రపంచముననో జీవించ గలిగియుండును. ఈ రాసులన్నియు తారతమ్యను బట్టి, సూర్యరహిత రాసులని తలచవలెను. అనగా ఇవి జ్ఞానములేని సమాజములుగానున్నవి. సూర్యుడు ప్రకాశ స్వరూపుడు. అనగా జ్ఞాన స్వరూపుడు. అనగా, ఒక వ్యక్తి దివ్య మార్గముగాని, సంఘమార్గముగాని, రెండును నిర్లక్ష్యముచేసినవాడు తనకు తెలియకనే తాను హీనదశ పొందుచున్నాడు. ఒక వ్యక్తి హీనదశపొందినట్లే, ఒక జాతివారుగాని, ఒక వర్ణమువారుగాని, సమూహముగా ఇట్టి జీవితమువల్ల నాశనముపొందుచున్నారు.

(సశేషము)

# పోతనా!

కుమారి సుందరి

ఏకశిలాపురిన్ త్రిభువనైకకవిన్ హరి సంస్మరించుచున్
లోకము విస్మరించి యిహలోక సుఖమ్ముల నీసడించితే,
నీ కవితామృతంపు చవినిన్ గను మానవుఁడెవ్వఁడేనిఁ దా
నా కమలాక్షుఁ గొల్వ మనసారఁగఁ గోరుఁగదయ్య పోతనా!

కుప్పించి యెగసిన గోవిందు భుజముపై - మెఱసెడి కాంచనాంబరపుఁ గాంతి,
యింతింతయై మఱియంతయై యెసఁగిన విప్రబాలకు మహావిశ్వరూపు,
నిఖిలలోకములను నిజవక్త్రమున జూపు - గోపీమనోనాథు కొంటెపనులు,
నతి దరిద్రుని చెంత నటుకులఁగొని సంప-దలనిచ్చు స్వామివాత్సల్యగరిమ
కనులముందు నిలిపి తను విస్మృతి ఘటించి- తెలుఁగు వారికెల్ల దివ్యసుఖము
గూర్చినావు నీవు, తీర్చుకోనేర మే-నాఁటికైన నీ ఋణము కవీంద్ర!

నిరుపమానమైన కవిత్వధరణిలోన-భక్తియను మహాబీజమున్ బాఁతి పెట్టి,
త్యాగజలముతో భాగవతాఖ్య తరువుఁ-బెంచి యాంధ్రులకు ఫలంబుఁ బంచినావు

లేదఁట రాజపోషణము, లేవట సక్రమమైన శిక్షణల్
లేదఁట యింటిలోన ధనలేశము, సత్కృషి వృత్తియంట, నీ
వాదట నాచరించుకొనినట్టి మహాద్భుత పుణ్యమేమిరో,
నీదు సుకీర్తి యీపగిది నిల్చెను ధారుణి శాశ్వతమ్ముగన్.

అమ్మను జేశ్వరాధముల కట్టి మహాకృతి నిచ్చి మాన్యముల్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులన్ బడక, సమ్మతితో హరి కిచ్చినట్టి నీ
కమ్మని కైతకున్ విలువఁ గట్టఁగ నేర్తురె యెంతవారలున్.

భగవంతున్ బరమున్ జనార్దను గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరి సన్నుతించితి పునర్జన్మంబు లేకుండఁగా,
జగతిన్ శాశ్వతకీర్తి నందితివి మోక్షానందమున్గంటి వా
భగవత్సేవలఁ గూర్చినావు బహు సౌభాగ్యంబులన్ పోతనా!

—(౦)—



భారతపిత గాంధీజీ మనకు యిహలోకంలో వదలి వెళ్లిన స్వంత ఆస్థి - పావుకోళ్లు, చెప్పులజత, గడియారం, కండ్లద్దాలు, గిన్నెలు, చంచాలతో బాటు ఆయన ప్రీతి పాత్రమైన భగవత్సంకీర్తన గ్రంథము, మర్కటత్రయం బొమ్మలు చూడనగును. వీనిని బాపూజీ "చెడుపుమాట్లాడ వద్దు, చెడుపుచూడవద్దు, చెడుపువినవద్దు" చిహ్నాలుగా గురువులని పిలచేవాడు.



శ్రీమతి మాధవి అమ్మగారి మృతవర్ధంతినాడు కుమార్తెలు శ్రీమతి శారదాదేవి, కుమారి వసంతగారలు పరివారమునకు వస్త్రదానము చేయుచున్నప్పటి దృశ్యములు



# అన్నప్రదాన దృశ్యములు









మరొక అన్నప్రదాన దృశ్యము.





అన్నప్రదాన సందర్భపు అభ్యాగతుల కోలాహలం



అన్న, వస్త్ర దానముల నందుకున్న పరివారబృందము



పరివార బృందములోని స్త్రీలు

# "జగన్నాటకం"

శ్రీమతి 'హృదయిని'

(గతసంచిక తరువాయి)

[మాలతిని ఉత్సాహ పరచడానికని అనూ నాటకం చూడడానికి రమ్మని ప్రోత్సహించింది. మాలతి తండ్రితో కూడ అనూతో బయలు దేరి వెళ్లి స్టేజిదగ్గరగా కూర్చుంది — నాటకం ప్రారంభమయింది. లత, బ్రహ్మచారి ఆశ్రమవాసులు. ఆశ్రమనియమావళికి విరుద్ధంగా వారిలో ప్రేమబీజాలు మొలకలెత్తి క్రమంగా ప్రవర్ధమానం కాసాగినవి. దానిని రహస్యంగా తోడి ఆశ్రమవాసులు, గురువు కనిపెట్టి అప్పుడప్పుడు మందలిస్తుండేవారు కాని వారి ప్రణయాన్ని అడ్డలేక పోయారు. గురువు చండప్రచండుడై మండిపడ్డాడు. బ్రహ్మచారి గురువును ప్రాధేయ పూర్వకంగా లతను తాను వివాహమాడి గృహస్థాశ్రమం స్వీకరించడానికనుజ్ఞ అడిగాడు. గురువు నిరాకరించి లత, బ్రహ్మచారి ఒకరితో నొకరు సంభాషించుకో కూడదని శాసించి వారి అపరాధమునకు వారంరోజులు ఉపవాసశిక్ష విధించాడు. యిక చదువండి]

లతా సుబుద్ధు లొకవైపు, గురూజీ మాధవు లొకవైపు నడిచారు. తెర వాలింది. ప్రేక్షకుల్లో చిన్న కలకలం. ముందు కథ యెలా నడుస్తుందో అనే ఆసక్తి అందరిని చుట్టుముట్టింది. జరిగినకథ ప్రథమాంకం కాబోలు. నేను మా మాలతివైపు చూచాను. ఆమె ఉద్వేగపూరిత హృదయంతో నన్నిలా అడిగింది.

'అనూ! నాటకంలో మాధవపాత్రధారి ఎవరో?'

'ఏం. ఆయన్ను గూర్చి అడుగుతున్నావు!'

'నేను ఆశ్రమంలో కొన్నాళ్లుండి వచ్చానే, అక్కడగూడా ఈ మాధవుడిలాటి ఒక యువక సన్యాసి యుండేవాడు. వారి పేరుగూడా మాధవుడే! వారి పేరుగూడా మా - ధ - వు - డే!!'

'ఈ మాధవుడు నాటకంలోవాడుగదా!'

'అనూ! నీతో నేనెప్పుడూ నా ఆశ్రమ జీవితం గూర్చి చెప్పలేదు. మాధవుడంటున్నానే ... వారినిగూర్చి నీకు తెలియదు!'

'ఆయనగూడ ఈ నాటకంలో లాంటివాడా!'

'అవును' అని ఒక నిట్టూర్పు విడిచింది మాలతి.

ఇంతలో తెర లేచింది. అది ఆశ్రమంలోని ఒక గది. ఒక బల్లమీద కృష్ణాజినం పరిచిఉంది. దానిమీద గురూజీ పెద్ద తలగడదిండు నాధారంగా పండుకొని ఉన్నాడు. అతడి పాదాలను ఒత్తుతూ ఒక ప్రౌఢ సన్యాసిని కూర్చుని ఉంది. వారిద్దరికి ప్రక్కగా ఒక దీప స్తంభం మంద మందమైన కాంతులతో వారిద్దరూ కనుపించేటట్లు వెలుగుతూంది.

ఆమె:—'స్వామీ, ఈ జీవితం నాకెంతో హాయిగా ఉంది. ఈ దాసురాలికి మీ చరణసేవ ననుగ్రహించి ధన్యురాలినిచేశారు. రోజూ మీ సంసేవనం చేయటంలో నాకెంతో సంతృప్తి!'

గురూజీ:—'సాధకురాలా! గురు ప్రేమను పొందటమే శిష్యుల కతిముఖ్యమయింది. అతి దుర్లభమయింది! అట్టిది నీకు నీ సుగుణ సంపత్తివలన సులువుగా చేకూరింది. ఇక నీవు ఇహలోకమందే అమరానందాన్ని అనుభవించట్వానికి అర్హురాలవు. నీకేమి కావాలన్నా ఈ నిత్యానంద స్వామి - ఈ పవిత్రాశ్రమాధికారి నీ కనుసన్నల కదలుచుండగా నీ కింకేమి కొదువ! స్వాతీ! దగ్గరకు రా! నీ తను స్పర్శలో ఏదో బ్రహ్మానందం - ఏదో అఖండానందం నిండిఉంది! నిజముగా నీవు నా ఆరాధ్యదేవివి!'

ఆమె:—'స్వామీ! అది అంతా నా అదృష్టం. ఈ ఒంటరి భిక్షుకురాలిపై మీ కెంత మమత - ప్రేమ! (అని గురుని సమీపించింది.)

గురు:—'శిష్యురాలా, శీఘ్రకాలంలో నీకు సమాధి సిద్ధిస్తుందని నా అంతరాత్మ చెపుతుంది ... నేన భయమిస్తున్నా. ఏదీ - ఆ వీవనతో కొంచెమిటు విసురు.'

ఆమె:—'(వీవనతో విసురుతూ) ప్రతిదినమూ మీరాదేశించినట్లు సాధన చేస్తున్నానుగదా. మీరు నా హృదయంపై తమ ప్రేమతో నిండిన చేతితో స్పృశిస్తున్నపుడల్లా నాకదే సమాధిగా ఉండేది. సమాధి అంటున్నారు. ఇంకొక రకమైనదేమైనా ఉన్నదా! ఆదెలా!'

గురు:—'అదే 'సదానంద సమాధి' అని అంటారు హఠయోగులు! ఎన్నిసార్లుపొందినా అందలి ఆనందాని కంతులేదు. ఏదీ నీ చల్లని చేతిని నా హృదయంపైఉంచు. భయమెందుకు? నీ కిది కొత్త కాదుగా!'

ఆమె గురూజీ గుండెలపై తన చేతిని ఉంచింది. ఇద్దరు పరస్పరం రెప్పవాల్చకుండా చూచుకొనసాగారు. ఇద్దరి పెదవులు కంపించేయి. నేనూ మాలతీ ఒకరి నొకర్ని చూచుకున్నాము. ఇందాక ఆ జంట! ఇపుడీజంట! ఎంత విభిన్నమైనవి! తిరిగి యిద్దరం నాటకంవైపు దృష్టి ఉంచాము.

ఆమె:—'స్వామీ! ఒక మాట! లతా మాధవులకు ఉపవాసదీక్ష విధించారటగా!'

గురు:—'స్వాతీ! నీకు తెలిసిందేకదా వారిద్దరికథ. ఆ ప్రేమలత ఈ మాధవ వృక్షాన్ని పెనవేసికొని పుష్పించి ఫలింపబోతూన్నది. ఇంకేమున్నదీ-అదే జరిగితే. ఆశ్రమ గౌరవం - మన అధికారం - మంటకల్సిపోవూ! క్షమించినట్లు మిషతో శిక్షగా వారం రోజుల ఉపవాసదీక్ష విధించాను.

ఆమె:—'అలా అయితే మన యిద్దరికికూడా శిక్ష...'

గురు:—'స్వాతీ! గురూజీ సేవే నీకు శిక్ష. నాకానందాన్ని ప్రసాదించటమే నాకు శిక్ష. దగ్గరకు రా!'

ఆమె:—'స్వామీ! మాధవుడు చాలా మంచివాడు. అమాయకుడు.'

గురూజీ వినుపించుకోనట్లు ఆమె హస్తాలను తీసికొని తన హృదయంమీద హత్తుకొనసాగాడు - హఠాత్తుగ ప్రక్క తలుపు తెరవబడింది. ఒక మానవఛాయ ఇద్దరిమీద పడింది. స్వాతీ గురూజీలు ఉలిక్కిపడి లేచారు.

గురువు మండుతున్న కొరివిలా - 'ఎవరు నీవు? గురుని ఏకాంత శయ్యా గృహానికి పిల్లిలా నిశ్శబ్దంగా ఎందుకు వచ్చావు?'

తలుపు పట్టుకు తూలుతూ లోపలికివచ్చి ఆ మానవుడు - 'స్వామీజీ! ఈ నిర్భాగ్య మానవుడు మీ దీనహీన శిష్యుడు మాధవుడే!'

గురు:—'నీవా! పగపూనిన త్రాచువై గురువునే పరీక్షింపవచ్చావా! అభాగ్యుడా! నిలు—, నీకు

తగిన సత్కారం చేయిస్తా!' అంటూ లేచి ఒక్కుమ్మడి మాధవుని స్వాతిమీదకు త్రోసి బిగ్గరగా - సుబుద్ధీ! కరటకా, దమనకా! ఇటు పరుగెత్తుకురండి!

ఒక్కొక్కరు క్షణంలో ముగ్గురు వచ్చారు. స్వాతీ మాధవులు మూగ ప్రతిమల్లా ఉండిపోయారు.

గురు:_'అదేమిట్రా అలా చూస్తూ నిలబడ్డారు ఇదుగో మోహ పశువు! స్వాతిని బలాత్కరించబోతున్నాడు! నలగపొడవండీ దుర్మార్గుడిని!

[ముగ్గురూ మాధవుడిని పట్టుకొని మర్దించారు. స్వాతి నిశ్చేష్టితయై నిలబడిపోయింది.]

గురు:_'నెట్టండీదుర్మార్గుడిని ఆశ్రమం బయటికి. ఆశ్రమ బహిష్కారమే యీ నీచునికి తగిన శిక్ష!'

[దెబ్బలకు సొమ్మసిలిపడిఉన్న మాధవుడిని ముగ్గురు శిష్యులూ ఈడ్చుకుపోయారు. తెర వాలింది. ప్రేక్షకులలో ధ్వని బయలుదేరింది.]

తలంచని విధంగా కథ పరిణమించింది. మాలతి వెర్రిగా నా వైపు చూస్తూ 'అనూ! ఈ కథ ...' ఆమె ఏదో చెప్పాలనుకొని చెప్పలేకపోయింది.

'చెప్పు మాలతీ! చెప్పు' అని అడిగాను నేను.

'అనూ! మాధవుడు! ...'

'ఆఁ మాధవుడు ...'

ఇంతలోనే తెర పైకి లేచింది.

పగిలిపోయిన భిక్షాపాత్రతో చిరిగిన చింపిరి బట్టలతో - ధూసరితమైన చిందర వందర జుట్టుతో - మూర్తీభవించిన విషాదంతో - రూపొందిన భగ్న హృదయంలా మాధవుడు నిలబడి పిచ్చి నవ్వుతో పాడుతున్నాడు.

ప్రేమకు చోటే లేదా జగాన!
జగాన ప్రేమకు చోటే లేదా!
నా బ్రతుకే నిరాశా!
నా లత నా కిక లేదా!
నా దరికిక మరి రాదా!
ప్రేమకు చోటేలేదా జగాన!
జగాన ప్రేమకు చోటేలేదా!

ఉన్నట్లుండి నా ప్రక్కనున్న మాలతి పిచ్చిదానిలా, 'బ్రహ్మచారీ! బ్రహ్మచారీ! ఇదిగో నీ లతను! ఉండు! -'అని అరుస్తూ స్టేజీముందు కురికింది. స్టేజీ పైకి వెళ్ళటానికి వీలుగానున్న మెట్లు మీదుగా పైకెక్కి మాధవుని పాదాలపై వ్రాలింది! 'లతా! లతా' - అని ఆ మాధవ పాత్రధారి మాలతి భుజాలు పట్టుకొన్నాడు!! (ఇది అంతా వ్రాయడానికింతసేపు పట్టిందికాని ఆ నాడు రాత్రి మా మాలతీ మాధవులు ఆ రంగస్థలంమీద కల్సుకోటం, పరస్పరం గుర్తించుకోటం ఒక్క క్షణంలో జరిగింది.) ప్రేక్షకుల్లో కలకలం బయలుదేరింది. చాలామంది లేచినిలుచున్నారు. రంగస్థలాన్ని చుట్టుముట్టారు కొంతమంది. మాలతిని సమీపించడానికి నాకు సాధ్యం కాకపోయింది. జనాన్ని తోసుకొంటూ మాలతీనాన్న, 'మాలతీ! మాలతీ' అని అరుస్తూ స్టేజీపైకెక్కిపోయాడు.

నాటకం కంపెనీ మానేజరుగాబోలు స్టేజీమీదకు వచ్చి నిశ్శబ్దంగా కూర్చోమని ప్రార్థించి జనాన్ని కూర్చోబెట్టాడు.

మాలతి:_" నాన్నా! వీరే ఆ బ్రహ్మచారి - దుర్మార్గులైన ఆ ఆశ్రమ వాసులచేత దండించబడి నాకోసంయిలా తయారయ్యారు. ఇదంతా నా కారణంవల్లనే జరిగింది నాన్నా!"

సత్యనారాయణబాబు మాధవుని చేతులుపట్టుకొని 'నాయనా! ఎన్నాళ్ళకు కనుపించావు' అని ఆప్యాయంగా పలకరించాడు.

ఇంతలో నాటకం మానేజరు, సెక్రటరీ లత తండ్రిని సమీపించారు. లత తండ్రి వారిద్దరికీ నమస్కరించాడు.

'బాబూ! ఈ ముసలివాడికి పుత్రికాభిక్ష పెట్టి పుణ్యం కట్టుకొన్నారు. ఈ మాధవునికోసమే రాత్రింబవళ్లు ఏడుస్తూ ఏడుస్తూ కృషించి యిన్నాళ్లు బ్రతికింది నా వెర్రి తల్లి. నా కుటుంబాన్ని కాపాడిన మీ నాటక కంపెనీ ఋణాన్ని తీర్చుకోలేను.'

మానేజరు:—'అయితే మా మాధవుడు వ్రాసిన డ్రామా - ఇంత వరకు ఆడిన డ్రామా - ఒకప్పుడు నిజంగా జరిగిన కథే అన్నమాట!

సెక్రటరీ అందుకొన్నాడు - నవ్వుతూ - అంతా జగన్నాటకం!

♦ ♦ ♦

మా మాలతికి - కాదు — లతకు, మాధవునికీ వైభవంగా పెండ్లి జరిగింది. తన పిచ్చికి కారణం - ఆమె యింతకాలం దాచిపెట్టినా నిజం కన్నులారా చూచాము నాటకంలో.

నిజంగా ఇప్పుడు మా మాలతిని 'లతా!' అనే పిలుచుకుంటున్నాము.

---

# అద్దెకొంప

శ్రీమతి వడ్డి కృష్ణవేణి



అప్పుడు నిద్రనుండిలేచి కాలకృత్యాలు తీర్చుకొని కుర్చీలో కూర్చున్నాడు మోహనరావు. కాఫీకప్పు చేతికందించి ప్రక్కనేనిలుచుంది భార్య. "ఏంశ్యామలా! రోజూప్రొద్దున ఎంతోహుషారుగ ఉండే దానివి - ఇవ్వాళ సావకాశంగ నిల్చున్నావే" అని ప్రశ్నించాడు మోహను.

"మీతో ఒక విషయం చెప్పాలండి" అంటూ జాలిగనిల్చుంది. "శ్రీఘ్రం సెలవివ్వండి; శ్రీమతిగారి కోరికేమిటో" అంటూ వేళాకోళం చేసాడు భర్త. "నాకోరికేమంత ఖరీదైంది కాదులెండి! ఎక్కడైనా ఒక మంచి ఇల్లు చూడండి. ఈ మట్టికొంప అలకలేక చస్తున్నాను. ఎక్కడచూచినా పందికొక్కుకన్నాలే" అని ప్రాధేయ పూర్వకంగ అడిగింది శ్యామల. సరేనన్నాడు భర్త.

శ్యామల కోరికప్రకారం ఒక మంచి ఇల్లు (అంటె గచ్చుదిలెండి) చూచాడు. అద్దెకూడా తక్కువే. చిన్న ఇల్లు అయినా ఎల్లాగో సరిపెట్టుకుందామని మంచి రోజు చూచి ఆ ఇంట్లోకెళ్లారు దంపతులు. వారికిద్దరు పిల్లలు.

మన ఇంటావిడయిన సుబ్బమ్మగారి మనస్తత్వ మెటువంటిదంటే ప్రతివారు తనకు లోబడి తను చెప్పినట్లు వినాలని, ఎవ్వరూతనకన్నా గొప్పగా వుండకూడదని, తన ఇంట్లో వున్నందుకు తన ఆదేశ ప్రకారం నడుచుకోవాలని తలచేది. మనశ్యామల కటువంటివి గిట్టవు. తనస్థళంలో తన ఇష్టమొచ్చినట్లు నడుచుకోవలెనని భావించేది. రోజులు గడచిన కొద్దీ సుబ్బమ్మగారి దుర్నడతలు శ్యామలకు నచ్చలేదు. సంసారి కుండవల్సిన లక్షణాలేవీ ఆమెలో కనిపించలేదు. అందుచే శ్యామల ముభావంగ వుండటం మొదలెట్టింది.

నిలువెల్ల ఈర్ష్యాసూయలు మూర్తీభవించిన సుబ్బమ్మగారికి శ్యామల ప్రవర్తన భరింపరానిదైపోయింది. "తనకన్నా గౌరవంగా వుంటున్నదే, ఇరుగు పొరుగువారు ఆమెను గౌరవించి మాట్లాడుతారే" అన్నకుళ్లు అధికమైంది. ఎల్లాగైనా శ్యామలను అల్లరిపెట్టి సాధించాలని తలచిందా కుళ్లు హృదయం.

ఒక రోజు ఉదయాన్నే "పాచివాకిలి సరిగతుడవలేదని, పిల్లలు అల్లరిచేస్తున్నారని" ఇంకా ఏమోమో సాధించటం మొదలెట్టింది. అవన్నీ వినీ విననట్టు, తప్పుక తిరుగ సాగింది శ్యామల.

"దుష్టుణ్ణిచూచి దూరంగవుండ" మన్నట్లు శ్యామల ఆమెతో మాట్లాడటం కూడ మానుకుంది. శ్యామలగాని, వారి పిల్లలు గాని కాలు కదిపితే "ఏంతప్పు దొరుకు తుందా" అని కంటిలో వత్తి వేసుకొని వెతుకుతూండేది. "తప్పులెన్ను వారు తండోపతండంబు, లుర్విజనుల కెల్లనుండు తప్పు"లన్నట్లు వెతగ్గా వెతగ్గా ఎక్కడో ఒక తప్పు దొరకక్కపోతుందా? అందులో పిల్లలున్న చోట ఏదో ఒక అల్లరి, తప్పు జరుగుతూనే వుంటుంది. వీటినిగురించి పెద్దవాళ్లు అల్లరి పడడం ఏమంత బాగుం టుంది చెప్పండి. పిల్లలుగాక అల్లరి పెద వాళ్లు చేస్తారా?

శ్యామలయొక్క శాంత గుణం, సుబ్బ మ్మగారి ఆగ్రహాన్ని అధికంచేసింది. ఆనాటి సాయంకాలం శ్యామలగారి పిల్లలు వారి స్నేహితులు కలసి అరుగుమీద ఆడుకుంటు న్నారు. అందరు కలసి వేరుశనక్కా యలుతిని చెక్కులు వాకిట్లో పోశారు. ప్రొద్దుగూకింతరువాత ఎవరిళ్లకు వారు వెళ్లి పోయారు. ఇంక మన సుబ్బమ్మగారి సంతోషానికి మేరలేదు. ఎందుకంటే పిల్లలు పోసిన చెక్కులు నలుగురికి చూపించి శ్యామలను అల్లరిపెట్టాలని చూచింది. తన భర్తకు చెప్పింది- ఆయన భార్య చేతిలో కీలుబొమ్మ. జీవశ్ఛవంలాగ జీవయాత్ర జరుపుచున్న ఒక నిర్భాగ్యుడు. కాకపోతే భార్యను స్వేచ్ఛగామీరబెట్టి ఏమీ ఎరుగనట్లు ఇల్లే వైకుంఠంలాగ వుంటాడా చెప్పండి! ఆ మహానుభావుడు భార్య బోధనలన్ని బురకెక్కింతరువాత ఇల్లెగిరి పోయేట్లు "మనుషులకు ఒకసారి చెప్తె బుద్ధుండాలి, వాకిలంతా ఇల్లా అల్లరిచెస్తారా! ఇదే మన్నా సంసారి కొంప కాదనుకున్నారా! ఇల్లా అవుతె ఇల్లు ఖాళీచేయండి"అని కేక లెయ్యటం మొదలుపెట్టాడు. ఆయన మాటలు విన్న శ్యామలగారబ్బాయి "మేము కుక్కలం పందులంగాదండీ! మను ష్యులమే - మేముకూడా మీకుమల్లె అన్నమే తింటున్నాము. ఇది సంసారి కొంపకాదని ప్రపంచమంతా అను కుంటూంటె మేంమాత్రం అవునన గలమా! "పదుగురాడుమాట పాటియై ధరజెందు, ఒక్కడాడుమాట నొక్క దెందు" అని వేమనగారు చెప్పినట్లు ప్రజ లందరు ఏకగ్రీవంగ ముక్తకంఠంతో కాదని మొరపెడ్తుంటె మేంమాత్రం ఏమినాలి చెప్పండి" అంటూ నవ్వటం మొదలెట్టాడు. ఇక చూడండి ఆభార్యా భర్తలిద్దరు శివమెత్తినట్లు ఆడిపోవడం మొదలెట్టారు. శ్యామలకు ఇదంతా వింటుంటే ఒళ్లు మండిపోయి, కోపము ఆగటంలేదు. ఏంచెయ్యాలో తోచక బాధపడుతున్నది. ఈ కాలపు పిల్లల నోరుకట్టడంఎవరితరం!

అప్పుడె శ్యామల భర్త ఇంటి కొచ్చాడు. శ్యామల జరిగినదంతా చెప్పింది. "పిల్లలన్నాక పొయ్యకుండా వుంటారా! తర్వాత ఊర్కుకోవాలిగాని, దెబ్బలాడు కోటమెందుకు" అని అన్నాడు. "ఇల్లా అవుతే మాకు కుదరదండి. మాకు శుభ్ర మెక్కువ. ఇల్లు ఖాళీ చేయండ"ని ఇంటాయన చెప్పాడు. వారి మాటలు విన్న మోహను "వారంరోజుల్లో తప్పక ఖాళీచేస్తాంలెండి" అని చెప్పగానే "మిమ్మల్ని గట్టిగా ఖాళీచెయ్యమని చెప్పామా? ఏదో సర్దుకొపోవాలిగాని" అంటూ తాపీగా మాట్లాడటం మొద లెట్టారు; వారిమాటల్లో ఏదినిజం- ఖాళీ చేయటమా! మానటమా?

కాని, శ్యామల, మోహనులు మాత్రం ఇల్లు ఖాళీ చేయాలని సంకల్పించు కున్నారు. ఎందుకంటె తెల్లవారినదగ్గిర నుంచి పిల్లలకు ఘోషెక్కువైంది. 'నరుల ఘోషకు నల్లరాయి బ్రద్దలవుతుందం'టారు పెద్దలు. అందుచే ఇంటికోసం వెదక నారంభించారు. ఈ విషయం సుబ్బమ్మ గారికి తెలిసింది. ఇల్లు ఖాళీఅయితే అద్దెరాదే, కరెంటు చార్జి తామే కట్టుకో వాలే. ఇంటికి చాకిరీ చెయ్యాలే - అన్న ఆలోచనతో కుమిలిపోయి గుసగుసలాడ నారంభించారు. శ్యామలకు ప్రక్క ఇంటావిడచేత 'ఇల్లు ఖాళీచెయ్యవద్దనీ, మాటకు మాట అనుకుంటె మాత్రం అను కున్నప్పుడల్లా ఖాళీచేస్తామా! ఒకరితో ఒకరు మాట్లాక పోయినా ఎవరి దారిన వారే వుండవచ్చు. ఒకవేళ సుబ్బమ్మగా రేదైనాఅన్నా సరిపెట్టుకొని అల్లాగె వుండండనీ, ఈసారి దెబ్బలాడుకున్న ప్పుడు చూడవచ్చమ్మాయిగారు' అని చెప్పించింది. పెద్దవారి మాటకాదనడ మెందుకని శ్యామల మాట్లాడకుండా వూరుకొంది. సుబ్బమ్మగారు మాత్రం వారంరోజుల కొకసారైనా దెబ్బలాడ కుండా వుండటంలేదు. దెబ్బలాడినప్పు డల్లా "ఇల్లు ఖాళీచేయుమనడం, తప్ప కుండా ఖాళీచేస్తాంలెండి" అంటే "గట్టిగా ఖాళీచేయుమన్నామా" అంటూ వుండటం అలవాటైపోయింది. ఈ అద్దెకొంపల్లో ఎన్ని అగుచాట్లు పడుతున్నామో చెప్ప తరంకాదు. ప్రభుత్వం వారు రైలు వాళ్లలాగ ఇళ్లుగట్టించి అద్దెకన్నా ఇయ్య కూడదూ! ఈసారి ఇంటివారు ఖాళీ చెయ్యమంటే ఏం సామాధానం చెప్పాలో! ఏంచెయ్యాలో పాఠకులే ఆలోచించి చెప్పండేం!



# విడిపోయిన చీకట్లు

శ్రీ కానాధిభోట్ల సుబ్బారావు

"ఎందుకూ పుట్టేడు పుటక - అప్రయోజకపు వెధవ. రెండుసార్లు తప్పాడు ఇంటర్. ఛీ! ఛీ! బజార్లో తలెత్తుకొని తిరగటానికే సిగ్గేస్తోంది. కనీసం రెండవసారయిన ప్యాసుకాని దద్దమ్మకెవడు పిల్లనిస్తాడురా? నీ తెలివిచూచి మీ మామకూడా పిల్లనివ్వటానికి ఒప్పుకోలేదు. ఇంటికి వెళ్ళిన నన్ను అమర్యాదచేసి నీవు అప్రయోజకుడవనీ, పోకిరివనీ నానా దుర్భాషలాడాడు. ఇంతకూ యిదంతా నా ఖర్మ -" అంటూ రంగనాధంగారు కొడుకును చెడాబడా చీవాట్లు పెట్టారు.

ఏమిన్నాస్తి-సుదర్శనం నోరు మూసుకొని కూర్చున్నాడు. అతని జీవితంలో తండ్రిచేత యింత ఘాటుగా తిట్లు తినటం యిది మొదటిసారి. తను చేసినపని తప్పే అయినా, లోకజ్ఞానం తెలిసినవాడవటంచేత లోలోన బాధపడ్డాడు; కాని తండ్రి నెదిరించి మాట్లాడలేదు. సుదర్శనం తండ్రిచేత చీవాట్లు తిన్నందు కంతగా బాధపడలేదు. అయితే మేనమామకుకూడా చులకనయ్యాడు. ఇది అతనికి విపరీతమైన బాధ కల్గింది.

'తను అప్రయోజకుడనట. దమ్మిడీ సంపాదించలేని దద్దమ్మట. మేనమామ అయితే మాత్రం మాటలెవడు పడతాడు? మామయ్య తన యింటికి రాకపోయినా, అమ్మ పోరు పడలేక నాన్నే తాంబూలాలు పుచ్చుకుందుకుపోతే, మర్యాదగా పలుకరించటం లేకపోగా నాన్నను గడ్డిపరకగా లెక్కకట్టి నానామాటలంటాడూ! తన్ను అప్రయోజకుడిగా నిందిస్తాడూ? అయనకూతురే దిక్కనుకున్నాడేమో. గతిలేక - "అన్నయ్యా! నీ కూతురు నిమ్మని" అమ్మ తన కాళ్ళమీదపడుతుందనుకున్నాడేమో. అప్పుడు జుట్టు చేతిలో యిరికించుకొని కీలుబొమ్మలా ఆడించవచ్చుననుకున్నాడు. తన శరీరంలో రక్తం ప్రవహిస్తున్నంతవరకూ అటువంటిపని చేయనివ్వడు. మామయ్య భాగ్యవంతుడేకావచ్చు. పెద్ద పెద్ద మేడల్లో హాయిగా పట్టె మంచాల్లో పవ్వళించవచ్చు. అందుకని స్వంత బావమరదిని హేళన చేసి పంపిస్తాడా? తనకేమీ గతిలేకపోవచ్చు. కాని దరిద్రుడయినంతమాత్రాన మానాభిమానా లెక్కడికిపోతాయి?'

సుదర్శనానికి ఆ రోజు సరిగా అన్నం తినబుద్ధి పుట్టలేదు. అయిష్టతగా రెండు మెతుకులునంజి మంచంమీద నడుంవాల్చాడు. మనస్సు ఆలోచనా ప్రవాహంలో కొట్టుకుపోతుంది. పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. తను అందరిచేత అసమర్థుడనిపించుకున్నాడు. ఇటు తండ్రికీ, అటు మేనమామకూ గడ్డిపోచకంటే హీనమైనాడు. తప్పి, తలెత్తి నలుగురిలో తిరిగేది ఎల్లా. ఇక ఒక్క క్షణం ఆ వూర్లోవుంటే లోకంచేత హేళనపడవలసి వస్తుందనుకున్నాడు. తను స్వతంత్రంగా జీవిస్తున్నప్పుడు తిరిగి తన తల్లి దండ్రులకు కనిపించవలెనని నిశ్చయించుకున్నాడు. కన్ను మూసినా నిద్రపట్టటం లేదు. మామయ్య దెప్పిపొడుపులు మాటి మాటికీ ప్రత్యక్షమౌతున్నయ్. సుదర్శనం ఒక్కసారి కళ్లు తెరచి చూశాడు. అందరూ గాఢ నిద్రలో మునిగియున్నారు. గప్ చిప్ గా లేచి బయటకు నడిచాడు. చంద్రుడప్పుడే అస్తమింపబోతున్నాడు. సన్నని మబ్బులు గాలికి అలలవలెలేచి ఆకాశంలో పరుగులిడుతున్నయ్. ప్రేయసి కౌగిలినుండి విడివడిన ప్రియునివలె చంద్రుడు కమలముల కౌగిలిని వదలలేక వదలలేక మాటి మాటికీ వెనుదిరిగిచూస్తూ తప్పనిసరిగా వెళ్ళిపోయాడు. తారలు చంద్రునివైపు చూచి మిణుకు మిణుకుమని నవ్వుతున్నయ్. చీకటి తెరలు తెరలుగా లోకాన్ని ఆక్రమించుకుంటున్నది.

రోడ్డు నిర్మానుష్యంగావుంది. అప్పుడప్పుడు చిన్న చిన్న పక్షుల అరుపులూ, చిన్న పిల్లల ఏడ్పులూతప్ప మరేవీ వినిపించటంలేదు. సుదర్శనం ముక్కుకు సూటిగా సాగిపోతున్నాడు. స్టేషనుకు చేరుకున్న తర్వాత ఎక్కడికిపోవాలీ అనే ప్రశ్న వచ్చింది. ఆలోచించే వ్యవధి లేకపోవటంవల్ల వెంటనే టిక్కెట్టు తీసుకొని మద్రాసు మెయిలెక్కాడు. బండి గుప్‌గుప్‌మని పొగలు గ్రక్కుతూ పరుగులెత్తుతుంది.

పట్నం చేరుకున్న తర్వాత ఒక గది అద్దెకు తీసుకొని ఉద్యోగాన్వేషణ ప్రారంభించాడు. మహా మహా బి. ఏలూ, ఎం. ఏ. లే కనీసం గుమాస్తా గిరి అయినా దొరక్క నానా గడ్డి కరుస్తుంటే, రెండు సార్లు ఇంటర్ దండయాత్ర కొట్టిన సుదర్శనానికి ఎవడు వుద్యోగమిస్తాడు? అసలు చదువుకోవటం ఒక సమస్య. ఎలాగో నానా జాతులవారినీ ఆశ్రయించి చదువుకుంటే వుద్యోగం దొరకటం విపరీత సమస్య. నేడు ఉద్యోగం సంపాదించడమంటే సముద్ర మథనంజేసి అమృతం సాధించినట్లే. ఆఫీసుల చుట్టూ తిరుగుతున్నాడు; నిరాశతో వెనుదిరుగుతున్నాడు. "Try and Try" అన్నాడు షేక్స్‌ఫియర్.

ఒకనాడు సుదర్శనం క్రొత్తగా పెట్టిన కంపెనీకి వెళ్ళాడు. అక్కడ తనలాగే పాతికమంది ఇంటర్వ్యూకోసం పడిగాపులుగాస్తూ కూర్చున్నారు. "ఏంరా భాయీ! ఏమిటీకథ" అని అడిగారు; సుదర్శనం వచ్చి రావటంతోటే. వాళ్ళుకూడా తన కేటగిరీకి సంబంధించినవారే అని నిర్ణయించుకున్న తర్వాత తన విషయం చెప్పాడు. భలే నువ్వుకూడా మాలో ఒకడివి — కూర్చో, కూర్చో, అన్నారు. ఎంతసేపు కూర్చున్నా ఆఫీసరు పిలవలేదు, ఫ్యాను కదలలేదు. ఈ జీవాలు మాత్రం సాయంత్రంవరకూ అక్కడేపడి వున్నయ్. ఐదుకు పదినిమిషాలు తక్కువైనా ఆఫీసరు దర్శనంకాలేదు. ఒరేయ్ భాయీ! ఆఫీసరు దర్శనమంటే ఏమనుకున్నావ్. సాక్షాత్తు భగవంతుని దర్శనమే అన్నాడొకడు - నీ మొహం భగవంతుడయినా ఒక్కసారి కనికరించి ప్రత్యక్షమౌతాడు. ఈ ఆఫీసరు మహాశయుడున్నాడే అట్లా కాదు. ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువులనీళ్లు త్రాగిస్తాడు? ఒకవేళ ఆఫీసరు దర్శనమైనా ఉద్యోగం దొరుకుతుందని నమ్మకమెల్లా? ఇదిగో చూశావ్రా - చదవటమే మహా పాపంగా వుందోయ్ యీ రోజుల్లో అన్నాడు ఒక దండులో.

ఉన్నవి రెండు సీట్లు. అవీ గుమస్తాగిరి. ఆ రెండు సీట్లకోసమే ఇంటర్లూ, బి. ఏ.లు పడిగాపులుగాస్తూ కూర్చున్నారు. ఏమో ఎవరి అదృష్టం ఎల్లావుందో. ఆఫీసరు ఎదుట నిలుచున్న దగ్గరనుండీ ఆలోచనలతో సతమతమౌతున్నాడు సుదర్శన్. అదృష్టం ఎవరిని వరిస్తుందో.

"నీ పేరు ఏమి" అని అడిగాడు ఆఫీసర్.

"సుదర్శన్" అని జవాబిచ్చాడు.

"క్వాలిఫికేషన్?" కొశ్చన్‌మార్కు మొహం పెట్టాడు.

'ఇంటర్' బిక్కుబిక్కుమంటూ సమాధానమిచ్చాడు. ఇంకా ఏవేవో ప్రశ్నలు వేశాడు. సుదర్శన్ చాలా నమ్రతగా జవాబిచ్చాడు. చివరిసారిగా తన గాథను చెప్పుకొని కరుణించమని ప్రాధేయపడ్డాడు.

"సరే వెళ్లు. రేపు రిజల్టు చెపుతాం" అన్నాడు. రేపు అంటే ఆఫీసరు భాషలో పదిరోజులని అర్థం. ఏమైంది అన్నట్లు మిగతా గ్రహాలు కొశ్చన్‌మార్కు మొహం పెట్టారు. తెచ్చిన డబ్బయిపోయింది. ఇంకా క్రితంనెల అద్దె యివ్వలేదు. ఇంటి ఓనర్ ఝూడిస్తున్నాడు. వుద్యోగం విషయమా తెలియలేదు. అలాగే రోజులు గడుస్తున్నయ్.

క్రిందటి గ్రహాలన్నీ పదిరోజుల అనంతరం ఆఫీసు చుట్టూ చేరినై. ఏక్షణాన ఏమంటాడో అని గుండెలరచేత్తో పట్టుకొని నిలుచున్నారంతా. ఇంతలో సుదర్శన్ కూడా అక్కడికి చేరాడు. సుదర్శన్‌ను

చూడగానే వాళ్లకు కొంచెం యీర్ష్య కలిగింది. రెండు రోజులనుండీ మంచినీళ్ళు ఆహారమగుటవల్ల కోపవచ్చిపడిపోయాడు సుదర్శన్. జవాను మొదలు ఆఫీసరువరకూ అతని చుట్టూ చేరారు. జావత్రాగించిన తర్వాత కొంత సేపటికి తేరుకున్నాడు.

ఇంతలో ఆఫీసరు - "ఏమోయ్ ఏమైనా మూర్ఛ రోగముందా" అని అడిగాడు.

కాంతిహీనమైన కళ్లతో చూస్తూ "లేదండీ - ఆకలిరోగం" అన్నాడు సుదర్శన్ జాలిగా ఆఫీసరు వైపు చూశాడు. ఆయన కళ్ళు అశ్రుపూరితము లయినయ్.

మర్నాడు క్లర్కు పోస్టులో సుదర్శనాన్ని నియమించినట్లు ఎపాయింట్ మెంటార్డరు చేతికిచ్చాడు. సుదర్శన్ పొంగిపోయాడు. ఆఫీసరుకు వేయి నమస్కారాలు చేశాడు. సుదర్శన్ యిపుడు స్వతంత్ర వ్యక్తి. ఆఫీసరు కనుసన్నల్లో మెలుగుతూ ఆయన మెప్పులు పొందుతున్నాడు.

ఐదు నెలలు యిట్టే గడిచినై. ఇంటిమీద ధ్యాస మళ్ళింది. నాన్న తనను తిట్టినా ఎంత కుమిలిపోతున్నాడో అని బాధపడ్డాడు. వెంటనే అమ్మకు రెండు చీరలు, నాన్నకు పంచెలూ, చెల్లాయిలకూ, తమ్ముడికి క్రొత్త గుడ్డలు తీసుకున్నాడు. నాన్నా అమ్మా సుదర్శనాన్ని చూచి ఎంతో సంతోషించారు. ఏదో అన్నామని అలా వెళతావా అన్నారు జాలిగా.

## 2

ఇంటికివచ్చిన బావమరదిని అవమానపరచి పంపిన శేషయ్య సంబంధాలకోసం తెగ వెదుకుతున్నాడు. ఈ కాలంలో వేలు మూటకట్టుకోకుండా పెళ్ళికొడుకు దొరకాలంటే మాటలా! ఇంటరుకు ఐదు వేలు బి. ఏ కు పదివేలు అని మార్కెట్ రేటు వుండనే వున్నది. ఒకవేళ గవర్నమెంటువారు వరకట్న నిషేధం జరిపినప్పటికీ బ్లాక్ మార్కెట్ బాపతు వుండనేవుంది. తిరిగాడు, తిరిగాడు - వూళ్ళన్నీ తనవేనని కాళ్లరిగేటట్లు తిరిగాడు. చివరకు రామాపురం సంబంధం ఖాయమనుకొనివచ్చాడు. కట్నం ఐదువేలూ లాంఛనాలూ వగైరాలు మరో వెయ్యి. ఈ ఆరువేలకూ ఒప్పించేసరికి తాత ముత్తాతలూ దిగివచ్చినంత పనైంది. అప్పటికీ (అయితే - గియితే) బావమరది గొణుగుతుండటం ప్రత్యక్షంగా విన్నప్పటికీ కదిపితే కంపవుతుందని నోరుమూసుకొని చక్కా వచ్చాడు.

"శుభమా అని బంగారంవంటి సంబంధం ఖాయపరచుకవస్తే ఇంట్లో అంతా ఏడుపు మొహాలేసుకు కూర్చున్నారేం" అన్నాడు మండిపడుతూ వచ్చీ రావటంతోటే.

అన్నపూర్ణ ఏమిమాట్లాడలేదు. "కట్నం ఐదు వేలు; లాంఛనాలు ఒక వెయ్యి, అప్పటికీ బావమరదిగాడు గొణుగుతూనే వున్నాడు. బరువు కట్నమయినా అమ్మాయి సుఖంకోరి ఒప్పుకున్నా. ఇదిగో చూశావూ, ఆ అబ్బాయిపేరు మధు, బి. ఏ ప్యాసయ్యాడు. కావలసినంత ఆస్తి ఒక్కడే కొడుకు" ఇంకా చెప్పుకుపోతున్నాడు.

అన్నపూర్ణ కళ్ల నీళ్లతో అంది "ఆ కట్నం సుదర్శనానికే యివ్వరాదండీ. వాడు మొన్ననే వుద్యోగంలో ప్రవేశించాడు. నా మాట వినండి. తరతరాలనుండీ వస్తున్న బంధురికాన్ని యింతటితో త్రెంపకండి."

శేషయ్యకు అరికాలిమంట నెత్తికెక్కింది. కోపంతో చిందులు త్రొక్కుతున్నాడు.

"నిన్ను సలహాలు చెప్పమని ఎవడేడిచాడు? ఆ సంగతి నాకూ తెలుసు. వెధవ అరవై రూపాయల వుద్యోగం. ఉంటానికి యిల్లులేదు. చారెడు భూమి కూడాలేదు. పైగా నిక్కు జాస్తీగావుంది. మనమేం దరిద్రులమా గతిలేనివాడికివ్వటానికి. వేలు పారేసి లాయర్ను తీసుకొస్తా" నన్నాడు సర్వం డబ్బుమీదనే ఆధారపడినట్లు.

వనజ గోడచాటునుండి వింటూంది. నాన్న మొండిపట్టుదల చూస్తే వనజకు దుఃఖమేసింది.

"నాన్నా! నేను బావను తప్ప ఇంకెవర్నీ చేసుకోను. నా కయిష్టంగా మీరే ప్రయత్నమూ చేయకండి" అంది కన్నీరు గారుస్తూ.

"ఊహూ నూరపోశావూ దానికీ కానియ్యండి, అంతా ఏకమై నన్నేం చేస్తారో చూస్తా" అన్నాడు కారాలు మిరియాలు నూర్తూ.

"నేనేం చేశానండీ! నా మీద ఎగిరిపడతారూ. అమ్మాయికి యిష్టంలేదని యిదివరకే మీకు తెలుసాయె. అది వద్దో మొర్రో అని మొత్తుకుంటుంటే దాని కయిష్టంగా చెయ్యడమెందుకూ - మనిద్దరికీ కావలసింది దాని సుఖమేగా! చిన్నప్పటినుంచీ సుదర్శన్ వనజా కలిసి మెలిసివుండేవాళ్లు. ఒకే చోట పుట్టకపోయినప్పటికీ ఒకర్నొకరు విడిచివుండేవాళ్లు కాదు. అటువంటి చిలకా గోరింకల్ని విడదీయటం మనకు మాత్రం భావ్యమా చెప్పండి! మా అన్నయ్య బీదవాడయినంత మాత్రాన, మనం భాగ్యవంతులమైనంతమాత్రాన సంబంధ బాంధవ్యాలు తెగతెంపులు చేసుకోవలసిందేనా! తరతరాలనుంచీ కలిసివస్తున్న మేనరికం యీ నాటితో అంతంకావలిసిందేనా! మీకు మీవాళ్లెంత ప్రాణమో నాకూ మావాళ్లంటే అంతే ప్రాణం. ఒకవేళ మనమే ఆ దరిద్ర స్థితిలో వుంటే మీరేమనేవారు. మీరే మా అన్నయ్యను అడగవలసింది. వదిన ప్రోద్బలంవల్ల అన్నయ్యే సంబంధం కలుపుకుందామనివస్తే ఆయన్ని గడ్డిపోచకంటే హీనంగాచూసి అమర్యాద చేస్తిరి. అయిందేదో అయింది. నా మాట వినండి" అంది ఉబికి వస్తున్న కన్నీటి నాపుకుంటూ.

బండరాతికంటే కఠినాతి కఠినమైన అతని మనస్సును వెన్నవంటి అన్నపూర్ణ మాటలు కరిగించలేకపోయినయ్.

"నాన్నా యింతపనీ మీరుచేసేముందు నన్ను ఏనుయ్యిలోనన్నా త్రోసి తరువాత మీ పట్టుదల నెరవేర్చుకోండి" అంది వనజ.

"నామాటవిని అన్నయ్యను మళ్లీ రమ్మనమని వ్రాయండి" అంది అన్నపూర్ణ ప్రాధేయపడుతూ.

"నోర్మూయ్ నాకేమవసరం మీ అన్న కాళ్ళు పట్టుకున్నదాకా" అంటూ చెంప ఛెళ్లుమనిపించాడు. అన్నపూర్ణ బుగ్గలు నీటిధారామయమయినై.

వనజ హృదయంలో గూడుకట్టుకొనియున్న దుఃఖోద్వేగం పొంగిపొర్లింది. బావా! అంటూ కుమిలి కుమిలి ఏడ్చింది. తను బావకు దూరమై పోతానేమోనని భయపడింది. తండ్రి దగ్గర అంత ఎక్కువగా మాట్లాడలేకపోయింది. స్త్రీ - అందులోనూ కూతురు కాబట్టి స్వతంత్రించి అంతవరకైనా చెప్పకోకల్గింది. తల్లి దగ్గరకువచ్చి బావురుమంది.

"నాన్న ఎంత మూర్ఖుడమ్మా నన్ను గురించి నీవు దెబ్బలు తిన్నావ్" అని వలవలా ఏడ్చింది తల్లి ఒడిలో తలదూర్చి. అన్నపూర్ణ మాత్రం ఏమి చేయగలదు? శక్తికొద్ది ప్రయత్నించింది. చివరకు వూరడించింది. ఆఖరుకు ఆపుకోలేక వలవలా ఏడ్చింది.

వనజ మనస్సులో అల్లకల్లోలం ప్రారంభమైంది. తను పరాధీనయైనట్లూ బావ తనవైపు దీనంగా చూస్తూ తుదినిశ్వాస విడిచినట్లు పీడకలలు వచ్చేవి. ఉలిక్కిపడి అర్ధరాత్రిలో లేచేది. ఎదురుగా బావ చిరునవ్వు నవ్వుతూ కనిపించేవాడు క్షణం.

బావకు పెళ్ళి అయింది. తను పంచుకున్న బావ హృదయం ఎవరో దొంగిలించారు. వనజ దీనంగా బావవైపుచూస్తూ నిలబడింది. సుదర్శన్ వనూ దగ్గరకు వచ్చాడు. పెల్లుబికే దుఃఖాన్ని ఆపుకుందుకు ప్రయత్నించింది వనూ.

"వనూ! విచారపడుతున్నావా- పెళ్ళి చేసుకున్నా, నా జీవితం జీవచ్ఛవంలా నడుస్తుంది. మీ నాన్న మనల్ని వేరు చేసినా నిన్ను మరచిపోలేను వనూ!"

"బావా నీవైనా సుఖపడు- నా జీవితంలో నిప్పులు పోసుకున్నాను బావా-" అని బావ పాదాలమీద వ్రాలింది.

"క్షమించు వనూ!"

"బావా" అని ఉలిక్కిపడి లేచింది వనూ. ఏమిటీ అంటూ తల్లి పరుగెత్తుకువచ్చింది. దడుచుకున్నావా అంటూ వీపు చరిమింది.

"లేదమ్మా బావ" అంటూ తల్లిని కౌగలించుకొని వలవలా ఏడ్చింది.

పెళ్లిచూపులవారు వచ్చే సుదినం ఆ నాడే. ఈ పెళ్ళి తప్పించుకోవట మెలా అని సతమత మౌతుంది వనజ. అదృష్టవశాత్తు ఆ నాడు రాలేదు. ఇక శాశ్వతంగా రాకుండావుంటే బాగుండునని వెయ్యి దేముళ్ళకు మ్రొక్కుకుంది. ఆ సాయంత్రం స్నేహితురాలి యింటికి పోబోతుండగా తండ్రి అన్నాడు. "త్వరగా రా అమ్మా! పెళ్ళి చూపులవారు వస్తారు. సాయంత్రం వస్తామని టెలిఫోనులో చెప్పాడు" అన్నాడు. వనజ అయిష్టంగా తలవూపి వెళ్ళిపోయింది.

♦ ♦ ♦

వనజకు పెద్ద చదువు రాకపోయినా థర్డుఫారం వరకూ చదువుకుంది. కొంతకాలం సుదర్శనంకూడా మేనమామ యింట్లోనే చదువుకున్నాడు. ఇద్దరూ ఎంతో చక్కగా చదువుకొనేవాళ్లు. కలిసి బడికి వెళ్ళేవాళ్ళు. కలిసి చదువుకొనేవాళ్ళు. ఒకరి హృదయాల నొకరు పంచుకొని మెలిగేవారు. ఇలా బాల్యమందే వారి స్నేహం అతిసన్నిహితంగా వుంటూ వచ్చింది. ఒకసారి మేనమామకూ సుదర్శనానికి చిన్న తగాదా వచ్చింది. ఆ తగాదాలో సుదర్శనాన్ని పట్టుకొని చెడమడా తిట్టాడు. గతిలేక తనింట్లో చదువుకొందుకు వచ్చాడని నానామాటలన్నాడు. అభిమానవంతుడైన సుదర్శనం వుడికిపోయాడు. వెంటనే పెట్టే బెడ్డింగు తీసుకొన్నాడు.

"నాన్న స్వభావమే అంత తొందరపడకు బావా" అని ఆపింది వనజ. సుదర్శన్ యిక ఒక్క క్షణం అక్కడ వుండదలచలేదు. అన్నపూర్ణకూడా ఎంతో బ్రతిమాలింది. కాని అభిమానం ముందుకునెట్టింది. చరాలున బయటకు వచ్చేశాడు. అంతటితో వనజ చదువుకు థర్డుఫారంవరకూ బ్రేకుపడింది. తండ్రి చదవమన్నా వనజ చదవనంది మనస్సు బాగలేక. సుదర్శనం మాత్రం ఫిస్తుఫారంనుండీ కంటిన్యూ చేశాడు.

3

గ్రాంటు చేసిన శెలవు ఆ రోజుతో ఆఖర్. మర్నాడు మద్రాసు బయలుదేరాలి. ఆ రాత్రి సుదర్శనానికి సరిగా నిద్రపట్టలేదు. మత్తుగా పడుకున్నాడు. తను మామగారింట్లో చదువుకుంటున్నప్పుడు జరిగిన సంగతులూ, చిన్ననాటి వనజా మనసులో మెదిలాయి. తానప్పుడు చూచినప్పటికి వనజకు పన్నెండేళ్లుండవచ్చు. అప్పటి పరిస్థితే వేరు. ఇద్దరూ కలిసి ఆడుకునేవాళ్లు. ఒకేచోట తినేవారు. కబుర్లు చెప్పుకుంటూ చదువుకునేవాళ్లు. ఆ లైఫ్! ఆ జాయ్ అన్నీ వేరు. అప్పుడు వనజ కన్య. అందులోనూ బాలిక. ఇప్పుడో పెద్దమనిషి. అప్పుడు బావా! బావా! అంటూ కబుర్లాడుతూ వెంటపడేది. మరిప్పుడో తన్ను చూడగానే సిగ్గుతో పారిపోదూ! మరుక్షణంలోనే నిరాశ క్రమ్ముకుంది, ఆలోచనలో పడ్డాడు.

నేనంత అదృష్టవంతుడనా - వనజవంటి పిల్లను దక్కించుకోలేకపోతున్నాను. నేను మామంత భాగ్యవంతుడను కాకపోబట్టేగదా వనజను దక్కించుకోలేకపోయాను. నా బోటి దరిద్రుడింట్లోవుండి కష్టాలనుభవించే దానికన్నా భాగ్యవంతుని పెళ్ళాడి పంచభక్ష్య పరమాన్నాలు తింటూ పట్టుపరుపుల్లో సుఖించవలసిందేగా నాకూ కావాల్సింది. మధుర స్మృతులు ఒక్కొక్కటే ప్రత్యక్షమౌతూ దివ్యానుభూతులను కల్గిస్తున్నయ్.

కాళ్ళకు పసుపురాసుకొని పారాణీ పెట్టుకొని, కంటికి కాటుక పెట్టుకొని, పార్వతిలా బొట్టుపెట్టుకొని, బుగ్గకు కాటుకబొట్టు పెట్టుకొని పెళ్లికూతురై వచ్చింది వనజ. ఆమె ముఖంలో ఆనంద రేఖలకు బదులు విచార రేఖలు ప్రస్ఫుటిస్తున్నాయ్. బంగారు చెక్కిళ్ళనుండి అశ్రువు లొలుకుతున్నయ్. పాలవలె మెరసే ఆమె పెదవులు తెల్లగా పాలిపోయినై, పున్నమ చంద్రుని మోముతో సరియైన ఆమె ముఖము విచారంతో కమిలిపోతుంది.

"బావా! నన్ను దీవించవూ," ఆమె కళ్ళనుండి అశ్రువులు రాలినై. బావ పాదాలను తాకింది.

"వనూ! నీవు భాగ్యవంతుని యిల్లాలివి కాబోతున్నావుకదూ. మంచిది వనూ - నీవు సుఖంగా వుండటమే నాకూ కావాల్సింది. నేను దరిద్రుడ నన్న సంగతి లోకాని కంతకూ తెలుసు. ఈ దరిద్రుని గురించి విచారిస్తున్నావా వనూ! చిన్ననాటి నుంచీ ఒక్కచోట చదువుకొంటూ కబుర్లాడుకొన్న మనం ఎలా మర్చిపోతాం వనూ - కాని నా బోటి దరిద్రుడిని కట్టుకొని కష్టాలకు బలికావటంకంటే భాగ్యవంతుని యింట్లో సర్వ సుఖాలూ అనుభవించటం మేలువనూ - ఈ దరిద్రుని యిక ఎప్పుడూ తలుచుకోకు. శుభమా అని పెళ్ళికూతురవై అలా ఏడుస్తా వెందుకు పిచ్చి పిల్లా - వూరుకో. బ్రహ్మ రాతను తప్పించలేంకదా! కాని వనూ నీవు మరొకరి కంకితమైనా, చిన్ననాటినుండి కలసి మెలసి తిరిగిన మన స్నేహ చిహ్నము మాత్రము నా హృదయం నుండి చెరిగిపోదు. ఎందుకో వనూ! నా హృదయంలో మరొకరికి స్థానం యివ్వలేకపోతున్నాను" అన్నాడు బెల్లుబికివచ్చే దుఃఖోద్వేగాన్ని ఆపుకొంటూ.

"బావా! నన్ను క్షమించవూ."

"వనూ!"

సుదర్శన్ త్రుళ్ళిపడిలేచాడు. ఎదురుగా గోడకు తగిలించిన గడియారం పొట్టవూపుకుంటూ పదకొండు కొట్టింది. పెళ్ళికూతురు మనఃఫలకంలో ప్రత్యక్షమాతుంది. అతని కళ్ల వెంట అనంత భాష్పజలం పరుగులెత్తి సముద్ర గర్భంలో కల్సిపోయినయ్.

ఇంతలో ఎవరో తలుపు తట్టిన శబ్దమైంది. ఇంత రాత్రివేళ తన గదికి ఎవరు వస్తారా అని సంశయించాడు. ఇందాక తను త్రుళ్ళిపడిలేచినదానికి నాన్న వచ్చాడేమో అని సంశయిస్తూ తలుపు తెరిచాడు. తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. ఎదురుగా వనజ! అబ్బ! అప్పటికీ యిప్పటికీ ఎంత మారిపోయింది.

"వనూ! ఇంతరాత్రివేళ ఒంటరిగా వచ్చేవేం" అన్నాడు ఆశ్చర్యపోతూ. వనూ మాట్లాడలేదు. ఆమె కళ్ళవెంట భాష్ప జలం పొర్లిపోతున్నయ్.

"అదేమిటి వనూ-ఎందుకలా ఏడుస్తావ్. జరిగిందేమిటి?" ఆదుర్దాగా అడిగాడు.

"మా నాన్న నాకిష్టంలేకుండా సంబంధం కుదిరించాడు బావా నేవప్పుకోలేదు. అమ్మ వద్దని మొత్తుకున్నది, నాన్న వినలేదు, అందుకని యిలా వచ్చేశా" అంది.

"అదేమిటివనూ. నీ కిష్టంలేకుండా కుదిరించాడా. అయితే ధనవంతుడై యుండవచ్చు."

"నీకు కూడా ఎగతాళిగావుందా బావా."

"లేదు వనూ! నీ సుఖమే నాకూ కావాల్సింది."

"కాదు బావా! మనిద్దరి సుఖమే అత్తయ్యకు అమ్మకు కావలసింది. నాన్న ఏదో అన్నాడని అప్పటినుండీ మా వూరుకి రాకుండాపోతావా. నన్ను కూడా మరచిపోయావా బావా" అంది.

"అలాంటిదేమీ జరగదు వనూ - నిన్ను నాకియ్యటం మీ నాన్నకు సుతారామూ యిష్టంలేదు. ఇక ఎవరు ఏడ్చి ఏమిప్రయోజనం వనూ. కారణం నేను బీదవాడిననేగా - అవును నేను బీదవాడినే. చూస్తూ చూస్తూ దరిద్రుడికి ఎవరు పిల్లనిస్తారు వనూ!"

"నీవు దరిద్రుడివికావు బావా. నాకు ధనమక్కర లేదు. భోగ భాగ్యము లక్కరలేదు."

"మరేమికావాలి వనూ."

"చిన్ననాటినుండీ కలిసిమెలిసి తిరిగిన నీ మనసు కావాలి బావా!" "సిగ్గుపడ్డది. మనిద్దరం ఒకసారి పెళ్లిళ్లాటలు ఆడుకున్నాం గుర్తుందా - అప్పుడు దండవేసుకున్నాం. అప్పుడు అత్తయ్య ఏమంది. చిలకా గోరింకలు త్వరలో దంపతులుకండి అని దీవించలేదూ. అప్పుడు నువ్వు ఏమన్నావ్" అని సిగ్గుతో అడిగింది.

"అమ్మో యీ బంగారు బొమ్మను విడిచిపెడతానూ" అని కదూ అన్నది అన్నాడు సుదర్శన్. నిజంగా ఆ జీవితమే మధురము వనూ. కల్లా కపటం లేకుండా చిలుకా గోరింకల్లా ఆడుకున్నాం. ఆటలతో పాటలతో కాలం యిట్టే గడిచిపోయేది. ఆ రోజులు యిక రావు వనూ!

వాళ్ళిద్దరూ ఎంతోసేపు బాల్యస్మృతి పథంలో విహరించారు.

"వనూ! మీ నాన్న మొండిపట్టుపట్టేడు. నీ సుఖమైనా చూడకుండా ఎంత పట్టుదలపట్టేడో చూడు. మీ నాన్న ఎన్ని మాటలన్నా నిన్ను చూచి ఆ మాటలన్నీ మరిచిపోగలిగాను. అవునుగాని ఇంతరాత్రప్పుడు ఎలా వచ్చావ్. అలా ఒంటరిగా రావచ్చా" అన్నాడు సుదర్శన్ కోపాన్ని నటిస్తూ.

"ఇంతకంటే వేరే గత్యంతరం లేకపోయింది బావా. చూస్తూ చూస్తూ నిప్పుల్లోకి దూకగలనా. అయినా బావ దగ్గరికేగా నేను వచ్చింది. నీవు నాకు పరాయి వాడవేంకావుగా" అంది.

"బలే! బలేదానివి వనూ. మరిప్పుడేం చేద్దాం. ఎవ్వరితో చెప్పకుండా యిప్పటి కిప్పుడే మద్రాస్ వెళ్ళిపోదాంపద. అందరికీ తిక్క కుదురుతుంది."

"ఇంకా నయం అక్కడే రిజిస్ట్రరు మేరేజి చేసుకుందాం అన్నావు కావు" అంది వ్యంగ్యంగా తన అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ.

సుధా వనూ నవ్వుకున్నారు. వారి నవ్వుల్లో మల్లె దొంతరలు విసిరినై. ఆనందం అవధులు దాటింది. ఎదురుగా గోడకువున్న సీతారాముల పటానికి నమస్కరించారు.

ఇంతలో తండ్రి "ఒరేయ్! తలుపుతియ్యి" అంటూ కేకవేశారు. వనజ గుండె ఝుల్లుమంది. సుదర్శన్ ధైర్యం చెప్పాడు. వెంటనే తలుపు తీశాడు.

"నువ్వటమ్మా వనజా, ఇదేమిటే ఎప్పుడొచ్చావ్. ఇంతరాత్రివేళ లేపనయినా లేపకుండా బావ గదిలోకి వచ్చావేం" అన్నా డాశ్చర్యంగా.

"సరాసరి బావ గదిలోకి వచ్చావేమిటే వనజా, మమ్మల్నెవరినీ లేపకుండానూ - ఎంత గడుసుపిల్ల" అంది అత్తగారు.

"వస్తుంది వస్తుంది రాదూ! స్నేహితురాలింటికి వెళతానని యిక్కడికి వచ్చావూ - ఇదా మీ అమ్మా నీవూ ఆడిన నాటకం. పెళ్ళి చూపుల వారొస్తున్నారు, తొందరగా రమ్మనమని నేను మొత్తుకుంటే నువ్వు చేసినపని యిదా. ఎంత అవమానం జరిగింది వాళ్ళకు. పిలిపించి అమర్యాద చేస్తారా అని నానా దుర్భాషలాడారు. ఎక్కడికి పోయిందో ఏమిటోనని కంగారెత్తి కాలు కాలిన పిల్లిలా తిరుగుతుంటే చివరకు ఏడ్పించి ఏడ్పించి 'అన్నయ్య వూరికి వెళ్లిందేమో' అంటుంది మీ అమ్మ! చస్తూ పడుతూ రెండవ ట్రయిన్‌లో వస్తిని. రా వెళదాం" అన్నాడు రొప్పుతూ.

"అన్నయ్యా! కాళ్ళు కడుక్కోండి" అంటూ నీళ్ళు తెచ్చిచ్చింది చెల్లెలు.

"బావగారూ కూర్చోండి" అని మర్యాద చేశారు బావమరది.

"అంతా క్షేమమా" అని పరామర్శించాడు సుదర్శన్.

ఇదంతా అవమానంగా తోచింది శేషయ్యకు. విధిలేక మంచంమీద కూర్చున్నాడు. "అయ్యో! రామా! ఎంత బావయితే మాత్రం పెళ్ళికాలేదు పెటాకులు కాలేదు ఒంటరిగా కూర్చుని కబుర్లాడుకోవటమా. అయినా మీకయినా బుద్ధివుండక్కరలేదటయ్యా. చిన్న పిల్లలని మందలించకుండా" అన్నాడు.

"అన్నం వడ్డించాను రండన్నయ్యా" అని పిలిచింది చెల్లెలు.

"ఒద్దమ్మా తిని వచ్చాను" అన్నాడయిష్టంగా.

"పరవాలేదు కొంచెమే తిను. మీ మాదిరిగా యింగ్లీషు కూరలు చెయ్యకపోయినా మంచి కూరలే వండాను అంది."

"బీదవాళ్ల యింట్లో తింటాడా మామయ్య" అన్నాడు సుదర్శన్.

"లేవండి బావగారూ" అన్నాడు రంగనాథం. "లే నాన్నా అత్తయ్య వడ్డిస్తుంది" అంది వనజ. శేషయ్యకు ఏదో గుండెల్లో కెలికినట్లనిపించింది. చర్రున లేచాడు "అన్నం తిన్నాను నామాట నమ్మరేం రా అమ్మా వెళదాం" అన్నాడు.

"నేను రాను నాన్నా. ఇక్కడనుంచి ఒక్క అడుగు కదలను. రా బావా! మద్రాసు వెళ్లిపోదాం అని" పెట్టే బెడ్డింగూ సర్దుకొని బయలుదేరింది.

"తీసుకెళ్ళవయ్యా నీ కూతుర్ని మహాఘరానాలు కొడుతున్నావ్. అసలు నీ కూతుర్ని ఎవడు రమ్మన్నాడిక్కడికి? అనవసరంగా మాటలు తూలకండి.—" అన్నాడు సుదర్శన్. "ఎందుకు నాన్నా మామయ్యను అలా అంటారు" అంది వనజ. "బావగారూ మంచి సంబంధమే నాకు కుదిరింది" అన్నాడు రంగనాథం. "అన్నం చల్లారిపోతుంది" అంది చెల్లెలు. ఇప్పుడు శేషయ్య ఒక్కడయ్యాడు. కూతురూ, బావమరదీ చెల్లెలూ భార్యతోసహా అంతా ఏకమయ్యారు. తను మాత్రం ఒకడయ్యాడు. వెర్రికేక లేసి రెండు మెతుకులు నోట్లో వేసుకున్నాడు.

తను వేసుకున్న ప్లాను భగ్నమైందని విచారించాడే కాని ఆమెకు యిష్టంలేనివాడితో కట్టబెడితే ఆమె జీవితాంతం ఎంత దుఃఖపడుతుందో వూహించలేకపోయాడు. తను పట్టినకుందేటికి మూడే కాళ్ళంటాడు. తను నిర్ణయించిన ప్రకారం జరిగి తీరాలంటారీ ముసలాళ్లు. అందువలన కలిగే మంచి చెడుగులను దూరదృష్టితో ఆలోచించే పరిజ్ఞానంలేదీ ముసలాళ్లకు. చిరుతవయస్సునుండీ ఒండొరుల హృదయాలను పంచుకు తిరిగినబాధ, శాశ్వతంగా తన హృదయాన్ని అర్పించిన బావ తనకు దూరమై తాను పరాయిదైనపుడు ఆమె (వనజ) గుండెలు ఎలాటి విపరీతదుఃఖానికి గురియవుతాయో ఆ ముసలివానికి ఏమి తెలుసు? శేషయ్య మనస్సులో కల్లోలం ప్రారంభమైంది. మంచి చెడుగులతో పోరాటం ఆరంభమైంది. మానవుడు యిటువంటి క్లిష్ట పరిస్థితులలోనే తనవ్యక్తిత్వాన్ని బుజువు చేసుకో గల్గుతాడు. మంచిని మాచి నడువు అని హృదయం ఘోషించింది. అతని మనస్సు గిర్రున తిరిగిపోయింది. ఎవరికీ యిష్టంలేనపుడు తానొక్కడే మొండిపట్టు పట్టి తనపట్టుదల కోసం అన్నెంపున్నె మెరుగని వనజను జీవితాంతం విషాదమయంగా చేయదలుచుకో లేదు. పరివర్తన భాష్పాలు జలజలారాలినై.

చేయి తుడుచుకుంటూ లోపలకు వచ్చాడు. వనజ జాలిగా తండ్రివైపు చూచింది. "నాన్నా! నా కిష్టంలేని సంబంధం కట్టి నన్ను నరకాన త్రోయకండి —" అని చెప్పుతున్నయి ఆ చూపులు. చెల్లెలు వయిపు చూచాడు - కళ్ల నీళ్లతో నిండి నించుంది.

"అన్నయ్యా! ఇంతటితో సంబంధం విడిపోవలసిందేనా అని చెప్పుతున్న యీ కన్నీళ్లు. బావమరది సుదర్శనం మాత్రం ఏమీ మాట్లాడకుండా నించున్నారు.

శేషయ్య కళ్లు అశ్రువులతో నిండిపోయినై.

"సరేనమ్మా వనజా! నీ యిష్టప్రకారమే చేస్తా." నన్నాడు తాంబూలం వేసుకుంటూ

వనజ ఆనందంతో సుదర్శన్ వైపు చూసింది. సుదర్శన్ మండిపోతున్నాడు. తననేమో వుద్ధరించినట్లు మాట్లాడుతున్నాడు నంగనాచిలా.

"నాబోటి దరిద్రుడికీ, అప్రయోజకుడికీ యిచ్చి నీకూతురి జీవితం దుఃఖమయం చేసేదానికంటే ఏ లక్షాధికారికో యిచ్చి సుఖవంతురాలిని చెయ్. నేను దమ్మిడి సంపాదించ లేని దద్దమ్మనుగా. మీతో మేము తులతూగలేము. వెళ్లువనజా. మామయ్య యిష్టప్రకారమే నడుచుకో.-" అన్నాడు కోపంగా సుదర్శన్.

శేషయ్యకిది భరింపరాని తలవంపైనా మాట్లాడ లేదు.

"ఏదో అయిపోయింది సుదర్శన్! నా దేతప్పనుకో ఇంకా ఎందుకు నా హృదయం బాధపెడతావు మొదట డబ్బున్నదని గర్వంగా ప్రవర్తించిన మాట వాస్తవమే - అన్నాడు" ప్రాధేయపూర్వకంగా.

వనజ జాలిగా సుదర్శన్ వైపు చూచింది. ఆ చూపులు సుదర్శన్ హృదయాన్ని గలిగింతలు పెట్టినై. వారి హృదయం కరిగి వెన్నెలయింది.

♦ ♦ ♦

వధూవరులు తలంబ్రాలు పోసుకోవటమైంది. వనూసుదర్శన్ సీతా రాములవలె పెండ్లి పీటలమీద కూర్చున్నారు. చదివింపుల సమయం వచ్చింది. శేషయ్య ఆరు వేల రూపాయలు వెండిపళ్లెంలో పోసి అల్లుని ఒళ్లో పెట్టాడు.

సుదర్శన్ ఆ డబ్బును త్రిప్పి కొట్టాడు:

"నీ సొమ్ము ఎవడికి కావాలి? ఆ సొమ్మును గురించేగా యింత గ్రంథం జరిగింది. మేమేమీ నీ డబ్బుకు మొహంవాచి లేము. ఎంత లేకపోయినా నిన్ను ఒక్క కానీ యాచించామా? కేవలం నీ మాదిరిగా డబ్బునే ప్రధానంగా చూచుకోవటం లేదు. డబ్బు! డబ్బు! డబ్బంటే గడ్డికరచేది నీవు. బావమరది ధనవంతుడయితే సంబంధం కలుపుకోవటం, బీదవాడయితే గడ్డి పోచతో సమానంగా చూచే అభిప్రాయం కల్గిన నీ డబ్బు నెవడూ ఆశించటం లేదు. నీకు డబ్బుందనేగా బావమరిదిని నానా మాటలాడి మేనరికం తిరస్కరించావ్. మామయ్యా! ఒక్క మాట మాత్రం గుర్తుంచుకో. లోకమంతా కేవలం డబ్బుమీదనే బ్రతకటం లేదు. సమృద్ధిగా డబ్బు లేనంత మాత్రన మనిషి తన మానవత్వాన్ని కోలుపోడు. ధనవంతుడు కేవలం డబ్బును తన ప్రాణంతో సమానంగా చూసుకుంటాడు. బీదవాడట్లా కాదు. పరువూ, మర్యాదా, సహనం, బంధు ప్రేమనూ తన సర్వస్వంగా చూచుకుంటాడు. డబ్బు లేనంత మాత్రన మనిషిని కొరగానివాడిగా చూడటం పొరపాటు. మనిషికి నీతీ, నిజాయితీ, పరువూ, ప్రతిష్టా ముఖ్యమని గుర్తించుకో. మా రెండు పొట్టలను ఎక్కడైనా పోషించుకోగలం. కష్టించి పనిచేసి బ్రతుకుతాం." అన్నాడు సుదర్శన్ ఆవేశంగా.

అంతా ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డారు. ఒక్కరూ ఒక్క మాట అనలేదు.

రంగనాథం అన్నాడు - 'ఒరేయ్, సుదర్శన్. ఊరుకోరా అయిందేదో అయింది. మాటి మాటికీ త్రవ్వుకుంటే ఏమిటిలాభం?-" బావగారిని మాబాగా చీవాట్లు పెట్టాడని లోలోన సంతోషిస్తునా పైకి అలా అన్నాడు.

"అల్లుడు బలే గడుసువాడే" అంది అన్నపూర్ణ.

"ఏమే వనజా మద్రాసు వెళ్లిపోతానన్నారటగా. ఇక పొండి యిద్దరూ కలిసి మద్రాసు కాదు, కలకత్తా పొండి. మాకేమీ దిగుల్లేదు" అంది, అత్తగారు.

వనజ సిగ్గుతో బావవైపు చూసింది. బావ కొంటెగా వెక్కిరించాడు. ఆ వెక్కిరింపులో చిన్ననాటి బావను చూసింది వనజ. నన్నెక్కిరిస్తావా అంటు బుంగమూతి పెట్టింది. ఆమె చూపులో చిన్ననాటి వనజను చూశాడు. వధూవరులిద్దరూ నవ్వుకున్నారు. మల్లెలు వికసించినయ్. నూతనదంపతుల ముఖంలోనుండి సీతారాములు చిరునవ్వు నవ్వుతూ కనిపించారు.



# సిరిసిరిమువ్వలు

న్యాయమూర్తి తీర్పు చెప్తూతూ ముద్దాయితో "నీవు చెప్పులు దొంగిలించావనే నేరం స్థిరపడలేదు; కనుక నిన్ను విడుదల చేస్తున్నాము - వెళ్ళిపోవచ్చు" అన్నాడు.

"మహా ప్రసాదం! కాని కొద్దిగా వ్యవధి నీయండి; నేరం మోపినాయన ముందు వెళ్లకపోతే నా కాళ్ళ చెప్పులుచూచి గుర్తుపడ్తాడేమో!"

◆ ◆ ◆

విద్యార్థి:-సార్! నా నోటుబుక్ మీద మీరు వ్రాసిందేమిటో తెలియడం లేదండీ!

ఉపాధ్యాయుడు:-ఏముందీ! - నీ దస్తూరి సరిగా తెలియడంలేదని వ్రాశాను.

విద్యార్థి:-మరి మీ దస్తూరి సంగతో!...

◆ ◆ ◆

"అమ్మాయ్! పొయ్యి మండుతున్నదేమో కొంచం చూడు" అన్నది తల్లి.

కుమార్తె "పొయ్యి మండుతున్నట్లు ఎక్కడ కనుపించలేదమ్మా! - పొయ్యిలోని కట్టెలు మాత్రం మండుతున్నవి.

అల్లంకి జగదీశ్వరి

"ఏమిటి వెంకమ్మా! యివాళ పాలింత నీళ్లగానున్నాయి!"

పాలుపోసేమనిషి "నిన్న గేదెలన్నీ నీళ్లల్లో పడ్డవి అమ్మగారూ! - అందుకనే పాలు నీళ్లలాగున్నాయి" అని జబాబు యిచ్చింది.

◆ ◆ ◆

ఉపాధ్యాయుడు:-రామూ! ఒక పొలమును నలుగురు 8 గంటలలో దున్నారు అదే పొలాన్ని యిద్దరు ఎన్ని గంటలలో దున్నుతారు?

రాము:-నలుగురు ఆ పొలాన్ని దున్నేశారుకదాసార్! - దున్నిన పొలాన్నే మరల యిద్దరు దున్నడమెందుకండీ!

గుజరాతీ చతుర్‌లాల్

◆ ◆ ◆

అమ్మాయి:-మాస్టరుగారండీ! రేపు ప్రయివేటుక్లాసుకు శలవివ్వాలి - రేపు మా రేడియోలో పిల్లల ప్రోగ్రాం వినాలి.

మాస్టరుగారు:-అలాగే తల్లీ - రేపు మేము పెద్దలందరంకలసి వనభోజనానికి వెళుతున్నాము. నేనా వన సంతర్పణభోజనం చేసి ఆయాసపడాలి!

యం. వి. రమణమ్మ

# శరణాగతులు

రచయిత్రి
పెరల్ బక్

అనువాదం
శ్రీ ఏకుల శ్రీనివాసులు

వాస్తవానికి వారి నివాస స్థలాలు ఆ నగరానికి బహుశా కొన్ని వందలమైళ్ల దూరంలోనేవున్నా, వారు ఏదో చాలా దూరదేశంనుండి అప్పుడే క్రొత్తగా వచ్చినవారిలాగా, ఆ రాజధాని ముఖ్య రాజబాటలో నడిచిపోతున్నారు. కానీ వారికా ప్రదేశం చాలా దూరంగా వున్నట్టనిపిస్తోంది. వారి నడకతీరు, ఏవో చెప్పలేనటువంటి భావతరంగాల శక్తి వారినిమిథ్యా ప్రపంచంనుండి తీసికొనిపోయి అమరగాన స్వప్న భువనాలలో విహరింపజేస్తున్నవా అన్నట్లుగా తోస్తోంది. ఆ సమయంలో వారు తమ భావిరక్షణకై ఆలోచిస్తూవున్నారు. ఆ ఆలోచనే - ఆ భావతరంగాలశక్తి. వారు పల్లెటూళ్లలో డొంకలకు, పొలాలకు మాత్రమే అలవాటుపడినవాళ్లైనా, ఆ విశాలమైన రాజమార్గంమీదుగా, నిశ్చలంగా, గంభీరంగా నడిచిపోతున్నారు. వారెప్పుడూ యింతకు మునుపు కనీ, వినీ, ఎరుగనటువంటి, చిత్రమైన వస్తువులూ, చూపరుల కాశ్చర్యంకలిగించే పలురకాల నవీన కార్లు, బస్సులూ, ఎన్నోవున్నా, వారు వాటితో తమకేమీ జోక్యం లేదన్నట్లుగా, నిర్లక్ష్యంగా సాగిపోతున్నారు. వారిని చూస్తూంటే, వారీమిథ్యా ప్రపంచంలో కాక, ఏదో స్వప్నలోక భువనాలలో విహరిస్తున్నట్లుగా కనిపిస్తున్నారు.

ఆ క్షణంలో కొన్ని వందలమంది గుంపులు గుంపులుగా కాలినడక సాగిస్తున్నారు. వారు ఆ నగరంలో ఏవస్తువునుగానీ, ఏవ్యక్తినిగానీ చూడటంలేదు. ఆ నగరవాసులు వీరిని అనేకమందిని చూశారేమో - విసిగి, వీరివంక చూడటంలేదు.

ఆ పట్టణమంతా వేలకొలది శరణాగతులతో నిండిపోయింది. వారు చినిగిన బట్టలు కట్టుకొని పట్టణ ప్రహరీగోడ కావల బయలులో విడిదిచేసి చాపలు కట్టుకొని వాటిలో తలదాచుకున్నారు.

ఆ రోజు ఏ గంటలోనైనా, చినిగిన దుస్తులలో, ఆర్ద్ర హృదయవిలాపంతో, శుష్కించిన దేహాలతో స్త్రీలు, పురుషులు, కొంతమంది పిల్లలు బారులుతీర్చి వచ్చుటను గమనించవచ్చు. వారంతా విడిదికై పుగాపోతున్నారు. ఏమిటీమౌనం! వారిలో, ఎవరైనా ఒక్కమాటైనా మాట్లాడడం యింతవరకూ కనిపించలేదు. ఈ శరణాగతులు యీ పట్టణంలో ఏజీవనోపాధికై వచ్చారు? ఏమిటో? అంతా అగమ్య గోచరంగావుంది!

ఆ నగరవాసులు వీరిని చూచినపుడు కోపంతో తమలో తాము - "ఈ శరణాగతులరాకకు అంతే లేదా! మనము వీరికి అన్నపానాదులు యిచ్చుటకు ఏమాత్రమయినను ప్రయత్నించినచో మనమంతయు ఆకలి మంటలతో చావవలసినదే" అనుకొనిరి.

ఈ కోపముతోనే చిన్న చిన్న అంగడివాళ్లు నిర్దాక్షిణ్యంతో భిక్షగాళ్లను దుర్భాషలాడడం మొదలుపెట్టారు.

ఇప్పుడు ఆ పట్టణంలో వుండవలసిన రిక్షాలకంటే పదిరెట్లు అధికంగా పెరిగాయి. అందుచేత అందరికి స్వల్పమయిన కూలితే ముట్తున్నాయి. ఈ శరణాగతుల సంఖ్య రిక్షాలాగేవాళ్లలోకూడా అధికమయింది. వీరు ఎంతటి స్వల్పమయిన కూలీలకైనా రిక్షాలాగటానికి ఒప్పుకుంటున్నారు. ఇందువలన రిక్షాలాగటమే జీవనవృత్తిగా ఎంచుకొని జీవించేవాళ్లు, ఈ శరణాగతులను తిట్టటం మొదలెట్టారు. ఎందుకంటే వీరు రావటం మూలాన అందరికీ రిక్షాలు అందుబాటులో ఎంత తక్కువ కూలికైనా వుంటున్నాయి. అందువలన వారికికూడా డబ్బులు చాలినంత దొరకక జీవనోపాధికై బాధపడవలసివుంటున్నది. పట్టణమంతా శరణాగతులరాకతో క్రిక్కిరిసి

పోయింది. ప్రతియింటా భిక్షమడుగుటయే! ప్రతి అరుణోదయ సమయమున ఈ శరణాగతులు మంచుతో నిండిన వీధులపైపడుకొని నిద్రించుచుండుటను చూడవచ్చును. ఇటువంటి పరిస్థితిలో ఈ వసంత ఋతువు చిరు చీకటిలో క్రొత్తగా మరలా వచ్చే శరణాగతులవంక ఎవరుచూస్తారు?

కానీ వీరు సామాన్యమైనజాతికి చెందినవారు కారు. నిమ్నజాతికి చెందినవారు అసలుకారు. ఆ జన్మాంతమూ బీదవారూ, ఎప్పుడూ వరద సమయాలలో ఆకలిమంటలకు గురియయ్యేవారు అంతకుముందే కారు. వారికి ఆస్తిపాస్తులూ, గృహాలూ, తోటలూ, అన్నీ వున్నాయి! కానీ ఇప్పుడు అవేవిలేవు! కానీ వీరు మర్యాదకులోటులేని కుటుంబాలలోని వారే! వీరిని కలిగిన ఏదేశమైనా గర్వపడడానికి అవకాశంవుంది. వీరంతా ఒకే జాతికి చెందినవారుగా కనిపిస్తున్నారు. వారి ముఖ భంగిమలలో, సౌమ్యత, సౌహార్ద్రం తొంగి చూస్తున్నాయి. వారందరూ ఒకే విధమైన నీలంరంగు నూలు గుడ్డలను ధరించివున్నారు. దీనివలన వారంతా ఒకే ప్రదేశవాసులై వుండవచ్చుననిపిస్తుంది. వారి దుస్తులన్నీ పాతపద్ధతిలోనే కుట్టబడియున్నవి. పురుషులు పెద్ద లాల్చీల మోస్తరువి వేసుకొనివున్నారు. వాటి కుట్లతీరు చాలా అందంగా కనిపిస్తున్నాయి. స్త్రీల గుడ్డలుకూడా నీలంరంగు గుడ్డతోనే కుట్టబడివున్నాయి. వారు తలలకు నీలంరంగు చేతిగుడ్డల మోస్తరువి చుట్టూ కట్టుకొనివున్నారు. వారిలో స్త్రీ పురుషులందరూ బలంగా, పొడుగ్గా, దేహసౌష్టవం కలిగినవారుగా కనబడుతున్నారు. కానీ స్త్రీల పాదాలు చిన్నవిగా చాలా అందంగా వున్నాయి. కొంతమంది పిల్లలు, వారి తండ్రుల భుజములమీద అడ్డముగా వేసిన కర్రలనుండి వ్రేలాడదీయబడిన బుట్టలలో కూర్చొనివున్నారు. అంతకంటె కొంచెం పెద్ద పిల్లలు నడిచివస్తున్నారు. వారిలో చిన్న అమ్మాయిలుకానీ, చంటిపాపలుకానీ యెవ్వరూలేరు. ప్రతి పురుషుడూ, బాలుడూ వారి పడక సామగ్రులను వారి భుజములమీద మోసుకొనివస్తున్నారు. వారి దుస్తులేకాక, పడకలుకూడా నీలంరంగు గుడ్డతోనే శుభ్రంగా చేయబడివున్నాయి. ఆ పడక మడతలకు జతపర్చి త్రాళ్లతో యినుపవంట పాత్రలుకూడా కట్టబడివున్నాయి. వారు ఆ పాత్రలను మట్టిపొయ్యిలమీదనుండి, ఆ గ్రామమునుండి వారు కదలవలసివచ్చిన సమయము సమీపించినదని తెలుసుకున్నపుడు తీసుకొనివచ్చినవని, నిస్సందేహముగా వాటిని చూడగనే చెప్పవచ్చును. కానీ ఏపాత్రలోనూ పిడికెడు అన్నములేదుసరికదా, ఈ మధ్య వాటిలో అన్నమువుండిన గుర్తులు పరిశీలనగా వెతికినాకూడా కనబడేటట్లులేవు.

చిరుచీకటిలో తొలిచూపుకి వారు బాగానే కనబడ్డారుకానీ వారి ముఖ భంగిమలను దగ్గరగా పరిశీలనగాచూస్తే వారికిప్పుడు ఆహారం అవసరమని తెలుస్తుంది. వారు ఆకలిమంటలకు గురియై, నిరాశా, నిస్పృహలతో సతమతమౌతూ, అంతిమ ఆశాపూరిత క్షణాలలో వున్నారని స్పష్టమౌతుంది. వారు మృత్యువు అనే పదానికి చాలా దగ్గరలోవున్నారు కాబట్టే ఆ క్రొత్త నగరంయొక్క వింతలవేటినీ వారి దృష్టిపథంలోకి తెచ్చుకోలేకపోయారు. ఏనూతన దృశ్యమూ వారి ఏకాగ్రతను మరల్చలేకపోయింది. వారి అంతరాత్మలన్నీ దేనినో వెతుకుతున్నాయి. ఈ కరువురాకమునుపు వారు గ్రామ జీవితాన్ని ఆనందంగా గడిపినవారే! వారు యిక కొద్ది క్షణాలలో ఆకలి కోర్వలేక మరణించబోతున్నామని తలపోస్తూ వేటినీ గమనించకుండా నిశ్శబ్దంగా నడకసాగిస్తున్నారు.

ఈ నిశ్శబ్దమానవుల పొడుగైన వరుసలలోని ఒక వరుస చివర నొక పండుముసలి వస్తున్నాడు. అతను కూడా రెండు బుట్టలను కావడిలో మోస్తూ వున్నాడు. అందరివలెనే యితడుగూడా పడక చుట్టను, ఒకే ఒక పాత్రను, ఒక బుట్టలో మోస్తున్నాడు. మరొక బుట్ట చినిగి పోయివుందిగాబోలు అతుకులు వేసి యుంది. ఆయినప్పటికీ అది చాలా

శుభ్రంగానేవుంది. ఆ బరువు తేలికగానే వున్నప్పటికీ, ఆ ముసలాయనకు చాలా బరువుగా వున్నట్టుంది. దీనిని బట్టిచూస్తే అతడు మామూలుగా పని చేయగలిగినటువంటి శక్తిగల వయసు కానందున, బహుశా యీ మధ్య కొన్ని సంవత్సరాలుగా శరీర కష్టానికి పూర్తి అలవాటు తప్పాడనీ స్పష్టమవుతోంది. అతను తన సహచరులను అనుసరిస్తూ, అతి కష్టంగా వూపిరి బరువుగా వదుల్తూ, పీలుస్తూ వున్నాడు. అతను తన కళ్లను పైకి ఎత్తి ముందు పోయే వాళ్ళను చూస్తూ, తను అందరికంటె చాలా వెనకపడ్డానని అనుకున్నాడు. అతని ముడతలు పడ్డ ముఖం, అతను మనస్సులో ఏదో తీవ్రంగా బాధ పడ్తున్నట్లు విచారరేఖలు వెలిబుచ్చుతోంది.

ఆకస్మికంగా అతను యిక ముందుకు నడవలేక పోయాడు. బుట్టలను జాగ్రత్తగా క్రింద పెట్టాడు. నేల మీద కూలబడ్డాడు. అతని తల మోకాళ్లలోకి వాలి పోయింది. అతని కళ్లు మూతలు పడ్డాయి. అతిప్రయాసతో శ్వాస బరువుగా తీసుకుంటున్నాడు. ఆకలిగా వున్నందునసేమో! అతని చెంపమీదనున్న చిన్న గాయంనుండి రక్తం పైకి వచ్చివుంది.

అతని దగ్గరలో చినిగిన దుస్తులు ధరించిన ఒకడు ఒక బల్లముందు కూర్చొని "వేడివేడి పాయసం" అని అమ్ముతున్నాడు. ఆ బల్లమీదనున్న దీపపు వెలుగు ముసలివాని వంగినటువంటి ఆకారంమీద పడింది. దారిన పోయే ఒకతను ఆ ముసలివాని వంక చూసి ఈలాగొణిగాడు.——

"నేను యీరోజు ఓ వెండి నాణెం మాత్రమే సంపాదించగలిగాను. అది నా ఆహారానికి సరి పోతుంది. కాని యిక్కడ యీ ముసలివాడున్నాడు పాపం! మంచిది! నేను రేపటికొరకు సంపాదించిన ఈ నాణాన్ని యితనికిచ్చేస్తాను. నా తండ్రిగాని బ్రతికివుంటే నేను అతనికిచ్చే వాడినిగదా! ఇతడే నా తండ్రి అనుకొనియిస్తాను."

అతను ఆ వెండినాణాన్ని తన జేబులోనుండి వెతికి తీశాడు. మరలా ఒక్క క్షణం సందేహించి గొణుగుకొని, ఒక రాగి నాణాన్ని తీసి దాన్ని వెండినాణానికి జతపర్చి —

"ఓ ముసలాయనా! ఇదిగో యీ డబ్బులు తీసుకో. పాయసం కొనుక్కొని త్రాగు", అన్నాడు అప్యాయంగా. ఈ మాటలకు ముసలాయన మెల్లగా తలఎత్తి చూశాడు. అతని చేతిలో డబ్బులను చూచినపుడు యితను చేయిచాచలేదు.

"అయ్యా! నేను మిమ్మల్ని యాచించలేదు. మాకు మంచి భూములున్నాయండి. అంతమంచి భూములవలననే మేమింతకు ముందెప్పుడూ యీ విధంగా ఆకలి మంటలకు గురికాలేదు. ఇప్పుడు వరదలొచ్చి పంటలను నాశనంచేసి భూములున్న వాళ్లకుకూడా కరువొచ్చింది. మాకు యిప్పుడు గింజలులేవు. ఉన్న గింజలంతా మేము యెప్పుడో తినివేశాము. నేను వారికి తినవద్దని చెప్పాను. కానీ వాళ్లు చిన్న వాళ్లు. ఆకలి కాగలేక తినివేశారు" అన్నాడు దీనంగా అతని వైపుచూస్తూ.

"తీసుకోవయ్యా! ఫరవాలేదు. తండ్రిలాంటి వాడివి!" అని డబ్బులిచ్చి ఒక నిట్టూర్పు విడుస్తూ వెళ్లిపోయాడు.

పాయసపు అంగడివాడు పాయసం తయారుచేసి అన్నాడు — "పాయసం నీకెంతకు కావాలి ముసలాయనా!" ఈ మాటకు ముసలాయన అతనివైపు తిరిగి "ఓ చిన్న కప్పుచాలు!" అన్నాడు.

"నీకు,ఒక్క చిన్న కప్పుపాయసం చాలుతుందా?" అంగడి వాడు ఆశ్చర్య పోతూ అడిగాడు.

"అది నా కొరకు కాదు." జవాబిచ్చాడు ముసలాయన.

అంగడివాడు యీ మాటలకు మరీ ఆశ్చర్య పోతూ ఓ చిన్ని కప్పులో పాయసం పోసి ముసలాయనకిచ్చి యెవరు త్రాగుతారో అని ఆతృతగా చూడసాగాడు.

ముసలాయన ఆ కప్పును తీసుకొని అతికష్టంమీద లేచి అతుకులు వేసిన బుట్టదగ్గరికెళ్లాడు. అంగడి వాడు బుట్టవంకా, ముసలాయనవంకా ఆతృతగా చూస్తున్నాడు, బుట్టలో ఏముందా – ముసలాయన యేంచేస్తాడా అని. ముసలాయన తన వణికే చేతులతో బుట్టమూతతీసి ఒక చిన్న చంటిపాపను చేతులలోకి తీసుకున్నాడు. ఆ పాప కళ్లు, మూసుకొని వున్నాయి. చిన్నతల! ముసలాయన ఆ పాప పాయసం త్రాగేందుకు వీలుగా ఆ పాప తలను పైకెత్తి పాయసం కప్పును నోటిదగ్గరవుంచాడు. ఆ పాప మెల్లగా గుటకలు వేస్తూ పాయసం త్రాగుతుంది. దీనిని చూడకుండా మామూలుగా ఎవరైనా ఆ పాపను చూశారంటే ఆ పాప చనిపోయిందని తప్పకుండా అంటారు.

ముసలాయన గొణిగాడు.

“ఇదే నా హృదయం! ఇదేనా ఆశాజ్యోతి!”

“నీ మనుమడా” అడిగాడు అంగడివాడు.

“అవును. నా ఒక్కగాను ఒక్క కొమారుని కుమారుడు” అని ఓ నిట్టూర్పు విడిచి, మరలా యిలా చెప్పడం ప్రారంభించాడు. “నా కొడుకూ కోడలూ, యిద్దరూ మా పొలాలలో పనిచేస్తూ వుండగా వరదలొచ్చినాయి. వాటిలో మునిగి చనిపోయారు.” అతని గొంతుక తడబడ్డది. కండ్లు చెమ్మగిల్లాయి. విచారచ్ఛాయలు అతని ముఖమంతా నిండుకొని వున్నాయి. ఇక చెప్పలేకపోయాడు.

మరలా చంటిపిల్లాడిని మెల్లగా బుట్టలోబెట్టి మూతవేసాడు. తర్వాత తన కాళ్లమీద గొంతుకూర్చుని ఆ కప్పులోని మిగిలివున్న కొద్ది పాయసాన్ని త్రాగేశాడు. తర్వాత ఆ కప్పుని, రాగి నాణాన్ని, అంగటివాని కిచ్చేశాడు.

ముసలాయన వూరికే కప్పునిచ్చి తనకేమి కావలెనని చెప్పకపోవటంలో అంగడివానికి ఆశ్చర్యం ఎక్కువయి–

“నీ దగ్గర యింకో వెండి నాణె ముందిగా! పాయసం కొనుక్కొని త్రాగకూడదూ” అన్నాడు. ముసలాయన తల అడ్డంగా వూపాడు.

“ఆ నాణెము విత్తనములకొరకు. నేను దానిని చూడగానే విత్తనములను కొనవలెనని అనుకొన్నాను. వాళ్లు అన్ని గింజలూ మిగల్చకుండా తినేశారు. మరలా యిప్పుడు భూమిని దేంతో పండిస్తారు!”

“నేను మరీ బీదవాడిని కాకపోయి వుంటే నీకు పాయసం ఉచితంగా యిచ్చి వుండేవాడిని. అయినా వెండినాణెంవున్నవాడికి వూరికే ఎందుకివ్వాలి!”

“తమ్ముడూ! నేను నిన్ను యివ్వమని అడగలేదే! నీవు నన్ను అర్థంచేసుకోలేవని నాకు తెలుసు. కానీ, నీకుకూడా భూములుండి వుంటే — ఈ వెండినాణెం విత్తనములకొరకు తప్పకుండా వినియోగించాలనీ, లేకుంటే రాబోయే సంవత్సరం కూడ యీ విధంగానే కరువు, కాటకాలలో బాధపడవలసి వుంటుందని – నీకు తెలిసుండేది! నేనిప్పుడు చేయబోయే మంచికార్యం యేమిటంటే– యీ డబ్బులతో గింజలుకొని పంటపండించడం-ఒకవేళ నేను యీ లోపల చనిపోయినప్పటికీ, యితరులయినా పండించుతారు.” అన్నాడు ఆర్ద్ర హృదయంతో.

అతడు మరలా ఆ రెండు బుట్టలను కావిడిలో భుజంమీద పెట్టుకుని ఆ పొడుగైన వీధిగుండా వణికే కాళ్లతో అతికష్టంగా సాగిపోతూన్నాడు. అప్పుడే నక్షత్రం ఆకాశంనుండి రాలిపోయింది.

---

# చైనా ఉపాధ్యక్షురాలు సన్ యట్ సేన్ సతి



డాక్టరు సన్ యెట్ సేన్ చైనా దేశములో గొప్ప సంస్కారవాది — ఇతడు 1867లో జన్మించెను. జన్మస్థానము క్వాన్ టంగ్ రాష్ట్రములోని హాంగ్ సాన్. తల్లిదండ్రులు క్రైస్తవమతము స్వీకరించిన వారైనప్పటికీ కుమారునికి జాతీయాభిమానము లోపించలేదు. మొదటి నుండియు సంఘసేవ చేయుచు దేశవిముక్తి కొరకై పాటుపడుచు విప్లవ సంఘము నొకదానిని 1893లో స్థాపించెను. తద్వారా అనేక ప్రయత్నములు చేసి విఫలుడై కూడా నిరుత్సాహపడక కృషి చేసి, మున్నూరేండ్లుగా చైనాదేశము నాక్రమించుకొని పరిపాలించు మంఛూ రాజవంశమును ఎట్టకేలకు నిర్మూలింపగలిగెను.

ప్రజా విజయానంతరము డా. సన్ యట్ సేన్ చైనాకు మొదటి ప్రసిడెంటు అయ్యెను. అధికారపార్టీ 'కూ్యమిన్ టాంగ్'. చైనాదేశపు అర్థికాభివృద్ధిని సాధించుటలోనూ, ప్రజాస్వామ్య ప్రభుత్వము నేర్పరచుటలోనూ, డాక్టర్ సన్ యట్ సేన్ అతని క్యూమింగ్ టాంగ్ పార్టీకీ, ఒకప్పుడు ఆ పార్టీలో నుండి తరువాత విడిపోయిన అభివృద్ధినిరోధకులకూ అనేక సంఘర్షణ లేర్పడుట సంభవించినది. సన్ యట్ సేన్ అనేక గ్రంథములను వ్రాసెను. వానిలో 1. జాతీయ పునర్నిర్మాణ ప్రణాళిక, 2 జాతీయ పునర్నిర్మాణ మూల సూత్రములు 3. మూడు ప్రజానియమములు - అనునవి ముఖ్యమైనవి. 1925 మార్చినెలలో యీయన భౌతిక దేహము ను చాలించెను.

ఈయనవద్ద ప్రథమమున కార్యదర్శిగా నుండి, తరువాత 1915 లో ఈయన్ను పరిణయమాడిన సతీమణి, - సూంగ్ - చింగ్ - లింగ్. అప్పటినుంచీ మదాం సన్ యట్ సేన్‌గా కీర్తికి వచ్చెను. ఈమెయే ఈ నెల 16 వ తేదీని మన దేశమున కతిథిగా వచ్చెను.

మదామ్ సూంగ్ చింగ్ లింగ్, లేక మదామ్ సన్ యట్ సెన్ గత శతాబ్ది ఆఖరులో పుట్టినది. విద్యాభ్యాసము అమెరికాలో. తరువాత ఆమె డాక్టర్ సన్ యట్ సెన్ వద్ద కార్యదర్శినిగా పని చేస్తూ 1915 లో అతనిని వివాహమాడి అచిరకాలములోనే గొప్ప విప్లవ వాదిగ ప్రఖ్యాతికి వచ్చింది.

1921లో సన్ యట్ సన్‌పై హత్యా ప్రయత్నాలు జరిగాయి. కాంటన్ నగరమును బాంబులు, ఫిరంగులతో ధ్వంసము చేసి, ఆ విధముగానే సన్ యట్ సెన్‌ను హతమార్చాలని శత్రువుల ప్రయత్నము.

ఆ సమయమున మదామ్ సూంగ్ చింగ్ లింగ్, (యిప్పటి మదామ్ సన్ యట్ సెన్) తాను డాక్టరు యింటివద్దనే నిలిచిపోయి, ఆయన నగరములోనే యున్నాడని శత్రువులకు ఒక ప్రక్క భ్రాంతి కల్గించుచూ, ఆయన రహస్యముగ నగరమునుంచి పారిపోవుటకు తోడ్పడినది.

1925లో డాక్టరు సన్ యట్ సేన్ మరణాంతరము ఆమె విప్లవ చర్యలలో పాల్గొనుచు క్యూమింటాంగు విప్లవ కార్య వర్గ కూటమిలో ఒక సభ్యురాలుగా ఎన్నికయింది. 1927 లో విప్లవపార్టీలో కలతలు వచ్చి, చాంగ్ కై షేక్, ఆతని అనుచరుడు వు హాన్ వాస్తవ్యుడు చాయింగ్ వీ, పార్టీలోనుంచి వైతొలగిరి, అప్పుడు మదామ్ సన్ యట్ సేన్, తాను తన భర్త సిద్ధాంతములను ప్రజ్వలింప జేయుదునని ప్రతిజ్ఞ పట్టి, దేశద్రోహుల సంఘంలోనుంచివిడివడి, చైనా జాతీయ విప్లవ వాదులతో జేరినది. వారి అంతిమ విజయమందు ఆమెకు అంతగట్టి నమ్మిక కలదు. ఆ సంవత్సరమే 'నాన్ ఛంగ్ తిరుగుబాటు 'ఆమె కోరిక ననుసరించినదే, జరుగుచుండగా, ఆమె దేశము వదలి, యూరపులోని చాలా దేశములను, మాస్కోను, పర్యటించి పెక్కు సమావేశములలో పాల్గొన్నది.

ఆమె 1931 లో స్వదేశమునకు తిరిగి వచ్చునప్పటికి చైనాలో అంతర్యుద్ధము సాగుచుండెను. కమ్యూనిస్టుపార్టీ ఆ యుద్ధమును ఆపి, జపాన్ దురాక్రమణను నిరోధించుటకు పూనుకుని యుండుట గమనించి, తనసర్వశక్తులా ఆ పార్టీకి తోడ్పడింది. జపాను వారు చైనా నైరుతి దిక్కున ఆక్రమించి షాంగేను ముట్టడించిరి. చాంగ్ కై షేక్ వారికి లోబడెను. కాని, మదామ్ సన్ యట్ సెన్ దానిని గర్హించెను. అదీ కాక తన బృందమును కూడగట్టుకొని, మానవ హక్కులను కాపాడుటకు చైనా లీగు అను దానిని స్థాపించి నిర్వహించెను.

1937లో జపానువారి నెదుర్కొనుటకు చైనా జాతీయ యుద్ధమును సమర్థించి క్యూమింటాంగ్ పక్షము వారిని శత్రువులకు సహకారము చేయువారని నిరూపించెను. 1938లో చైనా జాతీయదళము నేర్పరచి దానిద్వారా శత్రు నిరోధము, సైనికులకు వైద్యసహాయము, బాలబాలికలకు విద్యాబోధన, మందులు శస్త్రసాధనములు మొదలగునవి సైన్యమున కందించుట మొదలైన పెన్కో నిర్వహించి కమ్యూనిష్టు పార్టీకి తోడ్పడినది.

ఆమె అద్వితీయ సేవను గుర్తించి చైనా రిపబ్లిక్ గవర్నమెంటు ఆమెను తమ దేశమునకు ఉపరాష్ట్రపతిగా ఎన్నుకొనిరి.

దానికితోడు ఆమె దేశసేవాసంఘపు అధ్యక్షురాలు.

1950 లో మదామ్ సన్‌యట్ సెన్ ప్రపంచ శాంతి సంఘ సభ్యురాలై, అంతర్జాతీయ శాంతికై స్టాలిన్ స్థాపించిన బహుమానమును పొందగలిగినది. 1954 లో చైనా జాతీయ మహాసభలకు ప్రతినిధిగా ప్రజలామె నెన్నుకున్నారు. ఆమె అనేక గ్రంథములను ప్రచురించి చైనా జాతీయ యుద్ధమునకు తోడ్పడినది. ఆ కృతులన్నియు 1952 లో ఒక సంపుటిగా 'చైనా జాతీయ పోరాటము' అనే పేరుతో ప్రకటింప బడినవి.

'కృష్ణాపత్రిక' నుండి.



ఆటల పాటల సందడి

# తృష్ణ ముళ్లు

శ్రీ 'విజయ - రాఘవ'



(గతసంచిక తరువాయి)

కళ్లకు పారాణి పాదాలు కనబడినట్లు వుభయ పక్షాలవారికి విస్మయంకలిగింది. ప్రసాదరావు కన్యాదానం చేస్తున్నట్టే మురిసిపోయాడు. "సరే నంటే సరే" ననుకొని పందిట్లో వివాహసమాలోచనం పూర్తి చేసుకొని లేచారు. మరుక్షణంలోనే నరసమ్మ మరణం - అందర్నీ ఆశ్చర్య చకితుల్ని చేసింది.

ప్రసాదరావుకి నరసమ్మ మరణానంతరం "జీవితం మీద యిష్టం సన్నగిల్లి పోయింది. "ఎలా బ్రతికి తేలుంతెద్దూ" ! అని పెదవోవలు దొక్కలేదు. సంసారభారంకూడా తమ్ముడైన కుటుంబరావుమీద, చేతికదిగిన కుమారుడు వేణుమీద వదిలాడు. వేణు Bsc; (Agricultural) ప్యాసయి వుద్యోగాలమీద బ్రతుకుభారం వేసి కాలాన్ని వెళ్లబుచ్చాలనే యిచ్ఛలేకుండా, స్వంత వ్యవసాయం, గరువుభూములు హీనదశలో వుంటే, గొట్టాల భావుల్తో నీళ్లు తోడించి సాగుచేస్తున్నాడు. ప్రస్తుతం ప్రసాదరావు అన్ని శక్తులూ వుడిగిన వ్యక్తిగావున్నాడు. కొత్తావకాయ పెట్టిన రోజుల్లో ఆయన తప్పకుండా ప్రతిబంధువుయింటికి వెళ్లి రుచిచూసి యోగ్యతా పత్రంయిచ్చి పోతూఉండేవాడు. యీ విషయంలో ఆయన అభిప్రాయం అందరూ స్వీకరించాలని కుతూహలపడతారు. యీ మాట నరసమ్మ వుండే రోజుల్లో చాలా రాణింపులోవుండేది. యిప్పుడైనా నెలకు ఒకసారి బంధువర్గాన్ని పలకరించడానికి ప్రయత్నిస్తూనేవుంటాడు. రెండో కూతురు వివాహవిషయంకూడా కుటుంబరావుమీద, వేణు మీద పూర్తిగా వదిలేసినట్లే.

మల్లికార్జునరావు ట్రైనింగ్ పూర్తిచేసిన తర్వాత నందిగామువైపు బోర్డుస్కూల్లో వేసారు. అక్కడకు సంసారంతో తరలి వెళ్లాడు. కొంతకాలం గడిచిన తరువాత గన్నవరం తాలూకా దావాజీగూడెంలోకి బదిలీ చేసారు. మల్లికార్జునరావుని గురించి యెప్పటి విషయాలు అప్పుడు బ్రహ్మాజీరావు తెలుసుకొంటూనేవున్నాడు. తన మాటంటే లక్ష్యం లేదని, మల్లికార్జునరావు గురించి తనబృందానికి చెప్పుకొంటూవుంటాడు. ఇటువంటి పరిస్థితులలో రావమ్మ పెద్దకొడుకు నర్సుని గొల్లపల్లిలో పెద్ద కూతురు అరుంధతి దగ్గర స్కూలుఫైనలు చదివిస్తూవుంది. స్కూలు ఫైనలుపూర్తిచేసిన తరువాత, కాలేజీలో యెలాచేర్పించాలని రావమ్మ మహాకుతూహల పడింది. హోటల్లోవుంచడానికి భయమేసింది. బెజవాడంతటి మహాపట్టణంలో నర్సుని ఒంటరిగావుంచడానికి రావమ్మ మతరామూ యిష్టపడలేదు. ఎలాగైనా శోభనాచలపతిని వొప్పించి, బెజవాడ కాలేజీలో చేర్పించి, మాచవరంలో వున్న బ్రహ్మాజీరావు స్థలంలో పాక వేయించి కాపురంవుండాలని ఎత్తుగడవేసింది. యీ యెత్తుగడకు బ్రహ్మాజీరావు కట్టుబడిపోయాడు. బ్రహ్మాజీరావు, మొదట్నుంచి రావమ్మ అంటే చాలా అతీతమైన తెలివి తేటలుగలదనిగదా ! అభిప్రాయం. ఈనాడు రావమ్మ కొడుక్కి తన స్థలంలో పాక వేయించి చదువుచెప్పించుకొంటూ వుంటోందంటానంటే తన మనుమడు, కాలేజీలో స్వయంగా చేరుతున్నాడంటే తనకెంత పేరు వస్తున్నటు. శోభనాచలపతి రావమ్మ ఎత్తుగడకు తటస్థంగా వుండిపోయాడు. బ్రహ్మాజీరావు సరేననటం, శోభనా

చలపతి కాలేజీ సీటుకోసం చద్దన్నం మూట భుజానకట్టి బయలుదేరాడు.

అలివేలమంగ రెండోకొడుకు ఆనాడు తుమ్మ కొమ్మలునరికి దొడ్డిచుట్టూ కంపవేస్తున్నాడు. కంప చాలకపోతే బ్రహ్మాజీరావు స్థలంలోకి పోయి అలివేలమంగ కొట్టమంటేనే రెండుకొమ్మలు నరుక్కొస్తుండగా సత్యవతి చూసింది. వాస్తవికంగా అలివేలమంగ రెండోకొడుక్కీ, సత్యవతికి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. గబగబ యింట్లోంచి పరుగెత్తుకొచ్చి సత్యవతి వాకిట్లో నిలబడి -

“ఎవర్నడిగి కొడుతున్నావురా” — అంది.

“ఎవర్నడగాలేమిటి?” తలబిరుసుగా సమాధానమిచ్చాడు.

“ఎవర్నడగాలేమిటి! నీ యిష్టమొచ్చినట్లు అడక్కుండా కొట్టుకుపోవడమేనా!” అంది సత్యవతి.

“మా అమ్మ కొట్టమంటే కొడుతున్నా! నీ సొమ్మేంపోయింది - పరుగెత్తుకుంటూ వచ్చావ్” అన్నాడు.

“అమ్మ కొట్టమన్నదిట-కొడుకు కొడుతున్నాడు. బుద్ధిలేకుండా యేంమొగంపెట్టుకొని వచ్చి కొడుతున్నావ్. సిగ్గనేది వుండాలి మనిషి జన్మెత్తిన తరువాత” అంటూ సత్యవతి స్వరంపెంచుతోంది.

అలివేలమంగ నెమ్మదిగావచ్చి, — “ఏంమాటలు సత్యం అవి. నేకొట్టమంటేనే కొడుతున్నాడు. వద్దంటే మానేస్తాడుగా - వూరికే నోరు చేసుకొంటావ్ దేనికి? చిన్నా, పెద్దా తారతమ్యత బొత్తిగా పోయినట్లుందే.” అని పెద్దమనిషి తరహాగా అంది.

సత్యవతి మానాభిమానాలు యెప్పుడో మంటలో గలిపిన స్త్రీ కాబట్టి, నోటికి అడ్డు యెలావుంటుంది! వుండవలసిన పనేమిటి?

“చాల్లే జాణలాగా మాట్లాడొచ్చావ్! తగుదునమ్మా! అని సలహాచెప్పడానికొచ్చావ్. అసలు నీకేం హక్కుందని చెట్టుమీద చెయ్యి వేయించావ్. నీ స్థలమా - నీ చెట్టా!”

అలివేలమంగకి తల కొట్టేసినట్లయింది. “చూస్తూ చూస్తూ తోడబుట్టిన చెల్లెలు యెంత మాటకారిలాగా మారిపోయింది! ఎంత ధైర్యంగా మాట్లాడుతోంది. సిగ్గూ — యెగ్గూ లేకుండా యెట్లాబడితే అట్లా బజారుమీదనిలబడి అంటోంది. దీనికిదేం పోయే కాలం ...” అని ఆశ్చర్యం — సిగ్గు — లజ్జ పెనవేసుకొని పోయినయి.

“పోనీ! నాకేం హక్కులేదు నీకుందా” — అంది అలివేలుమంగ.

“ఆ...! యీ స్థలం నాన్న నాకమ్మాడు” ఖచ్చితంగా దిశలు మారు మ్రోగేలాగు గర్జించింది.

అలివేలమంగ నిర్విణ్ణపోయింది. బ్రహ్మాజీరావు యీస్థలం అమ్మాడా! “మా నాన్న — నాకమ్మాడం టోంది. “మా నాన్న” అంటే నాకు నాన్న కాడా! యెలా దీనికి అమ్మతాడు. పెంచుకొన్న కొడుకు రామకృష్ణ యెలా వూరుకొన్నాడు! రామకృష్ణ యేమైనా అప్రయోజకుడా స్థలం అమ్ముతుంటే చూస్తూ వూరుకొంటానికి! దీన్లో యెంతనిజం దాగివుంది? అంతకంతకు అలివేలుమంగ కడుపులో యేదో దేవుతున్నట్లుగావుంది. — చివరకు

“పోనీ! ఆ మాట ముందే చెప్పితే ఆగిపోయే వాడుగా. అనవసరంగా నోరు పారవేసుకోవడం దేనికి. నిన్నేమన్నాడని పెట్టిపోషిస్తున్న దానిలాగా అంటున్నావే!” — అని కొడుకును రమ్మని పిలిచింది.

“అడక్కుండా చెట్టుకొడుతుంటే మూగమొద్దులాగా చూస్తూ వూరుకోమంటావా! చక్కగా, బంగారంలాగా యెదుగుతున్న దాన్ని నరకడానికి చేతులెలావచ్చాయి! — నీ చేతులు మాడిపోను. నీకైనా

జ్ఞానముండక్కర్లా!" సత్యవతి ప్రేలాపన అధిక మైంది. తిట్లు దొంతర దొంతరగా పేరు కొంటున్నయి.

"తనుకూడా దాని మాదిరిగా మాట్లాడితే అక్క గారై చేసిన నిర్వాహకమేముంది. అన్నీ తెలిసిన దాన్నికూడా యీ విధంగా మాట్లాడితే లాభం యేమిటి? చిన్నా పెద్ద తారతమ్యం దానికిలేకపోతే నాకుండదా! ఛా! అంటే అందిలే" అని అలివేలు మంగ సారెసారెకు తల్చుకొని, తలవంచుకొని లోపలికి వెళ్లిపోయింది. కొట్టిన రెండుకొమ్మలు యీడ్చుకొంటూ యింటికొచ్చాడు అలివేలు రెండో కొడుకు.

సత్యవతి యింకా కాసేపు అలాగే తిట్టుతూ నిలుచుండిపోయింది.

## 10

ఒకరోజున బ్రహ్మాజీరావు సత్యవతి యింటికి రావడం జరిగింది. తండ్రిని చూసేటప్పటికి సత్యవతి విషణ్ణవదనంతో కాళ్లు కడుక్కుంటానికి నీళ్లిచ్చింది. కాళ్లుకడుక్కొని, ఉత్తరీయంతో మొగం తుడుచు కొంటూ,

"అలావున్నావేమమ్మా" — అన్నాడు.

"యింకాయేముంటుంది. చీటికిమాటికి చివాట్లు తినమని మావారు యిల్లుకట్టారు. నాబ్రతుకంతా తిట్లుతింటూవుంటమేగా. అయిన దానికి, కాని దానికి అలుసుగా దొరికింది నేనొక్కదాన్నేగా! యేమన్నాపడాలి. తప్పుతుందా! మనస్సుకిశాంతి లేకుండా వుంది కాపురం"

సత్యవతి వాగ్ధారకు ఆనకట్ట కట్టలేక పోతు న్నాడు బ్రహ్మాజీరావు. "విషయం వూహాకంద కుండా వురకలు వేసుకొంటూ పరుగులు తీస్తుంటే తానెలా అడ్డగించాలి" అనేది స్ఫురించడంలా.

"ఏమిటిదంతా నీలో నువ్వేదో యేడుస్తుంటే నాకెట్లా తెలుస్తుంది. అసలు యేం జరిగింది. ఎవ రేమైనా అన్నారా?"

"ఎవరో పరాయివాళ్లంటే యింతగా యెందుకేడుస్తా. యీనోటితో మళ్లా అదంతా యేమంటూ చెప్పనుని"

"ఆయిన వాళ్లు మాత్రం నిన్నంతగా అంటానికి హక్కేముంది. నీవల్ల తప్పేమైనా వుందా!"

సత్యవతికి యేడుపు పొర్లుకొస్తోంది. బ్రహ్మాజీ రావుకి అంతా అయోమయంగా వుంది.

"అసలేం జరిగిందో చెప్పమంటే యెందుకలా కుంగిపోతావ్"

"అక్కయ్య నానామాటలంటే చెల్లెలు పడవల వలసిన బాధ్యత వుందిగా! అక్కయ్య మాట్లా డిందని చెల్లెలుకూడా మాట్లాడితే యింక అక్కయ్య గౌరవమేముంది?"

"చిన్నక్కయ్య అలామనిషిని అంతతేలిగ్గా చూడదే. అసలు నోరెత్తి అనవసరంగా మాట్లాడే తత్వం దాందికాదే! యెప్పుడూ కూడా అనని మనిషి నిన్నెలా అనగలిగింది — అనివుండదు."

బ్రహ్మాజీరావు బుర్రలో క్రమేపీ ఆలోచనలు వుంగరాలుంగరాలుగా తిరుగుతున్నాయి.

"ఎందుకొచ్చిందీ తగాదా నీకు - దానికి?"

"దాని రెండోకొడుకు వచ్చి మొన్న నీస్థలంలో తుమ్మచెట్టు నరకుతుంటే వీల్లేదన్నాను. ఎందుకు వీలుగాదూ! అని మొరాయించి బలవంతంగా చెట్టుమీద చేయివేయించి కొమ్మలు నరికిస్తుంటే, అదేమిటనన్నా. నీకేంహక్కుంది అడగటానికి అని నానామాటలు కూసింది. నేను మాత్రం యెలా వూరుకొని వుంటాను. నువ్వే చెప్పు నాకుమాత్రం పౌరుషంలేదా! నాకుమాత్రం హక్కులేదా! అది అంటేనే నేనన్నాను" అని సత్యవతి చెప్పడం అయిపోగానే బ్రహ్మాజీరావుకి తల గోక్కోవలసిన పరిస్థితి యేర్పడింది.

"ఛీ"! యేమిటిదంతా అక్కాచెల్లెళ్లకి పొత్తుకుదరకపోయినప్పుడు యింకెవరితో ఎందుకు కుదరదని అనుకోవడం తెలివి తక్కువగా వుంటుంది. ఒకే రక్తధారకలవాళ్లు, ఒక కడుపున పుట్టినవాళ్లకే యిలా జరిగిందంటే యింకేమిటి? అయినవాళ్లేయిలా తగాదాలు పెంచుకొని, సంబంధ బాంధవ్యాలు తెగ తెంపుకొంటుంటే, పరాయి వాళ్లను వేలెత్తి చూపడం తగనిపని. "తుమ్మచెట్టుదగ్గర అక్కచెల్లెళ్లకు అనురాగం అంతమయి, అపకీర్తిపాలయి, అపవాదులకు లోనై, అహర్నిశలు, అంతులేని క్రోధాలు పెంచుకొని యెడబాటు కాటందుకొని వెర్రిబాగులై పోవడం యెంత శోచనీయంగా వుంటుందో ప్రపంచానికి - వీళ్లేమైనా ఆలోచించారా! సత్యవతికి యెంతహక్కుందో, అలివేలు మంగకి కూడా అంతేగా. తనకూతుళ్లందరికి సమానమైన హక్కు వుండనేవుంది. అటువంటప్పుడు యీ తగాదాలేమిటి?" బృహస్పతిలాగా బ్రహ్మాజీరావు ఆలోచించటం మొదలు పెట్టాడు. చివరకు ఓదార్చవలసిన బాధ్యత తనదేగా!.

"ఇక వూరుకో! జరిగిందేదో జరిగిపోయింది" అని వూరడించి ఆనాటికక్కడే భోజనాదులు పూర్తి చేసుకొని యెటో పోయాడు.

## 11

శోభనాచలపతి సీటుకోసం యెగ్రహాబలంలో బయలుదేరాడోగాని చటుక్కున బెజవాడ కాలేజీలో దొరికింది. కాలేజీలాంఛనాలు తీర్చేసి, గొల్లపల్లి బ్రహ్మాజీరావు దగ్గరకు చేరి విషయం అంతా సవిస్తరంగా మనవిచేసాడు. రావమ్మ హంగామా యింతని చెప్పనలవిగాదు. "నర్సు కాలేజిలో చేరుతున్నాడమ్మా" అని వూరంతా చాటింపుకన్నా మిన్నగా చాటించింది. అన్ని నోళ్లు మంచినే మాట్లాడుతాయని అనుకోవడం పొరపాటు. "కాలేజీ, కాలేజీ అంటమేగాని, డబ్బు దండగ తప్ప మరేంలేదు" అని ఒకాయన వూరికే అన్నాడు. "యిద అక్షరాలానూ!" అని ఒకాయన వూరికే అన్నాడు. యిది అక్షరాల యెంతవరకో, కొంతవరకు నిజం అనక తప్పదు.

బ్రహ్మాజీరావు శోభనాచలపతి మంచిరోజున వచ్చి స్థలంకి శంకు స్థాపనచేసారు. ప్రస్తుతానికి అనుకున్నట్లు పాకవేయదలిచారు. కలపంతా శోభనాచలపతిదే పై కప్పుకూడా అతనిదే. యేటొచ్చీ స్థలం బ్రహ్మాజీరావుది.

రావమ్మ నర్సుకి వండిపెట్టడానికి తట్టెడుసంసారం కొండపావురూరులో వదిలిపెట్టి, బెజవాడకు చేరింది. నర్సు కాలేజీకి వెళ్తూ వస్తూన్నాడు. యీ సంగతి జరగడానికి ముందుగానే ఒకసారి బ్రహ్మాజీరావు సుబ్బారావు లేని సమయంలో అలివేలు మంగని చూడటానికి వచ్చి సత్యవతి చెప్పిన తగాదా విషయాన్ని ప్రస్తావించాడు.

అలివేలుమంగ తండ్రిచెప్పిన మాటలన్నీ విని ఆశ్చర్య చకితురాలైంది. చివరకు —

"కల్లబొల్లి మాటలన్ని అలా కల్పించి చెప్పడం నా చేతగాదు... నేనే అన్నానో—అదే అందో భగవంతుడికే తెలుసు. నువ్వుదానికి స్థలం అమ్మావని అంది. అదీ యెంతవరకు నిజమో నీకే తెలియాలి. మొదట్లోనే యీ స్థలం నువ్వమ్మేనని చెప్పి నట్లైతే నేను దానిజోలికెళ్లేదాన్నే గాదు. యీ విషయంలో ఎంతవరకు న్యాయాన్యాయాలున్నాయో యెవరెవరిది తప్పో ఆరోజున తగాదా జరుగుతున్నప్పుడు వున్నట్లయితే, తెలిసేది. విన్నవాళ్లెవరైనా వుంటేనూ, చూచినవాళ్లుంటేను పోయి కనుక్కో ఎవరిది తప్పో. సత్యవతి చెప్పిన మాటల్ని ఆధారంచేసుకొని యీనాడు నన్నడగటంలో యేంగొప్పవుంది." అని నిష్కర్షగా అలివేలుమంగ అనేసేటప్పటికి బ్రహ్మాజీరావుకి నిశ్చేష్టిత యేర్పడి - యేమంటానికి దారితోచక —

"నువ్వెంతో నాకు, అది కూడా అంతేగా. - దానికి నేనెందుకు స్థలం అమ్మేను! అవసరం వస్తే మీ యిద్దరు ఆ స్థలంని వుపయోగించుకోండి అన్నానుగాని — అమ్మేనని అనలేదే." అన్నాడు.

"ఇప్పుడెన్నైనా చెప్పొచ్చు. తప్పంతా నాదేనని నువ్వూ దాంతో పాటు అంటున్నప్పుడు వొప్పుకోక తప్పుతుందా! అయినా నాకెందుకు యింకా నీస్థలం. అనుభవిస్తున్న అవమానంచాలు. పోనీ యీనాడది మాట్లాడకపోతే నాకేం జరగందిలేదు. కాకపోతే ఒక తల్లి పిల్లలమని ప్రపంచం అనుకునేటట్లు వుందామనేగాని, వేరేంలేదు." అని, అలివేలు మంగ లేచి వెళ్లిపోయింది. బ్రహ్మాజీరావు నెత్తిమీద గుడ్డ వేసుకొని వచ్చినదారినే తిరుగుముఖం పట్టాడు. భోజనానికి అలివేలు వుండమంటున్నా వినిపించుకోకుండా వెళ్లిపోయాడు.

12

సరోజిని, మల్లిఖార్జునరావు దావాజీగూడెంలో కాపురం పెట్టారని చాలామందికి తెలిసింది. బ్రహ్మాజీరావు నెలకు మూడుసార్లైనా వస్తూండే వాడు దావాజీగూడెం. మల్లిఖార్జునరావుకూడా తీసుకునేవాడుగాదు. కాని వచ్చినవాడు వచ్చినట్లు వెడితే చాలా సంతోషపడేవాడు. అక్కడ వున్న దుష్టచతుష్టయంతో మల్లిఖార్జునరావును గురించి దుష్ప్రచారం చేయడం చూస్తే యితరులకే కడుపుమండిపోతూండేది. సరోజిని యింతరాద్ధాంతం చేసినా, మల్లిఖార్జునరావు తమాయించుకొని చేస్తున్నాడు. దసరాసెలవులు యింకా పదిరోజులకువస్తాయనగా బ్రహ్మాజీరావు వచ్చి విడిదిచేసాడు. ఆ వుండటం సెలవులు రేపటినుంచి మొదలనగా చివరవరకువున్నాడు. సరోజిని తనకుచెప్పకుండా చేస్తున్న అప్పులు మల్లిఖార్జునరావు బజారుకు వచ్చినప్పుడల్లా తెలుస్తుండేవి – ఆనాడువచ్చిన అప్పుల జాబితా పరికించి, తెల్లబోయి-

"ఎందుకింత ఖర్చయింది" అన్నాడు.

"సంసారం అయినప్పుడు ఖర్చుకాకుండా యెలా వుంటుంది."–అంది సరోజిని.

"చేసేఖర్చు కాస్త ఆలోచించి చేస్తుండాలి."

"నాకలా చేతగాదు. - కావాలంటే మీరే చేసుకోండి. –"

"చెప్పకుండా అప్పులు చేస్తావ్ - యీనాడు యివన్నీ తీర్చవలసినదంటే యెంతకష్టమో నీకేం తెలుస్తుంది"

"ఏమో,యెలాగో నాకేం తెలియదు. అయినా యీ కాపురం నేచేయలేను. ప్రతిదానికి జాగ్రత్తంటే నే వేగలేను."

♦ ♦ ♦

మల్లిఖార్జునరావు వసారాలోకి వచ్చి కుర్చీలో పడుకున్నాడు. బ్రహ్మాజీరావు, రాగమ్మ–కాంతమ్మ అనే కరటకదమనకులతో పిచ్చాపాటీ వేయబోయాడు. సరోజిని బజారుగుమ్మంలో నిలబడి బ్రహ్మాజీరావుని భోజనానికి రమ్మని కేకలేస్తోంది. మల్లిఖార్జునరావు ఉగ్రుడయ్యాడు. అతనిలో ఉగ్ర రూపం చూడటం యిదేనాకు మొదటిసారి. గట్టిగా పళ్లుకొరుక్కుంటూ "కందకు లేని దురద కత్తిపీటకెందుకన్నట్లు" "ఆయనకు లేని ఆకలి నీకవుతున్నట్లుందే. ఆకలివేస్తే అన్నంతినాలని ఆయనకు తెలియదూ! గొంతుకచించుకొంటూ బజారునబడి పిల్చకపోతే. యీ మొదనష్టం యెలా విరగడవుతుందో తెలియకుండావుంది." అంటూ లేచి తుండుగుడ్డ బుజాన వేసుకొని బజారున పడ్డాడు.

బ్రహ్మాజీరావుతో మల్లిఖార్జునరావు భోజనానికి కూర్చోదల్చుకోలేదు. ప్రక్కింటి గంగాధరరావుతో వాకిటరుగు మీద కూర్చుని తెగని సమస్యలను చర్చల్లోకి దించారు. మల్లిఖార్జునరావు యీరోజున ఆవిధంగా మాట్లాడుతాడని గంగాధరరావు యింతవరకూ వూహించలేదు. గంగాధరరావుకూడా అవివాహితుడైనా అనుభవంగల్గిన వ్యక్తి. "పెళ్ళయిన నేను – పెళ్లికాని నీవు ఒకటేనోయ్" అని మల్లిఖార్జునరావు అనగానే గంగాధరరావుకి ఆశ్చర్యం వేసింది. మల్లికార్జునరావు యిలాంటిది సందర్భోచితంగా మాట్లాడుతున్నాడంటే వెనుకయేదో లోతు తెలియని లోయ వుంటుందని వూహించేవ్యక్తి.

(సశేషము)

# ఏడుపు

శ్రీమతి జి. రాఘవమ్మ

నవ్వటమనేది ప్రతి మానవజీవికి ఎట్లా సహజమో ఏడవటమనేదికూడ సహజం. నవ్వటంకన్నా ఏడవటమే ప్రకృతిలో మరింత సహజమేమోననిపిస్తుంది. నవ్వు ఎడుపు నెట్లా తెప్పిస్తుందో ఏడుపుకూడ నవ్వునట్లాగే తెప్పిస్తుందనడం అతిశయోక్తికాదు; అసంభవంకాదు. ఎక్కువైన ఆనందంతో నవ్వితే ఏడుపు తప్పకుండ వస్తుంది. ఇక ఏడుపు నవ్వు తెప్పిస్తుందనడం విడ్డూరంగా కన్పించినా వాస్తవంమాత్రం కాకపోదు. పుట్టిన బిడ్డ ఏడిస్తేగాని కన్నతల్లి ముఖం వికసించదు. గోడప్రక్కన ఉన్నవాండ్లు ఆ యేడుపు కొఱకు చెవులు నిక్కబెట్టుకొని కూర్చుంటారు. ఆ యేడుపుకన్నా ఆనందాన్నిచ్చే వస్తువు తల్లిదండ్రుల కింకొకటి ఉండదు బాలలకు ఏడుపు బలమిస్తుంది. అందుకే 'బాలానాం రోదనం బలం' అన్నారు పెద్దలు. అట్లా అని ఇరవైనాల్గు గంటలు పాలివ్వకుండ పిల్లల నేడిపించమని గాదనుకోండి అర్థం!

ఏది యెట్లాగున్నా యేడుపనేది మానవులలోని అంతర్గత భావాలను, చిరకాలం దాగిఉన్న స్వభావాన్ని బయటపెట్టిస్తుంది. ఒక్కొక్కప్పుడు హృదయభారం తగ్గించడానికికూడ యేడుపు ఉపయోగిస్తుంది. కుమారుడు చనిపోయినాడని హఠాత్తుగా విన్న ఒక తల్లి మ్రాన్పడిపోతుంది. ఆ సందర్భంలో ఒక ఆంగ్లేయకవి 'She must weep or she will die,' అంటాడు. ఆమె ఆ సమయంలో యేడవకపోతే హృదయం వికలమై చనిపోవడం అనివార్యము. మనుష్యుల మనస్తత్వాల ననుసరించి ఈ యేడుపు అనేకరూపాలతో అవతరిస్తుంది. చింతించడం, విచారించడం, ఈ రెండు సమఉజ్జీపదాలు. వీటికన్నా ఒకడిగ్రీ ఎక్కువ ఏగవడం. రోదించడం. విలపించడం రెండు ఒకజాతికి చెందినవి. అన్నిటికన్నా ఏడుపు పెద్దగా వినపడాలనుకుంటే కవి 'భోరున' అనే పదాన్ని పైపదాలకు జత చేస్తాడు. దానితో ఆయేడుపు తారస్థాయి నందుకుంటుంది.

పూర్వకవులు, ప్రస్తుతం కవీశ్వరుల మనుకునేవారు అనేకవిధాలుగా పుస్తకాలల్లో యేడిపించి యేడ్చిచూచారు. ఏ యేడుపు కాయేడుపే ఒక వింతగా, అందంగా ఆహ్లాదంగా ఉంటుంది. కాని చదివేవాడిని ఏడ్పించగల ఏడుపు నూటికో పుస్తకంలో దొరుకుతుంది. ఆయేడుపే నిజమైన యేడుపు. కవి యొక్క హృదంతరాళాలనుంచి పెల్లుబికి బయటబడిన

విచారం, అదేనిజమైన యేడుపు. మిగిలిన యేడుపులన్నీ కల్లబొల్లియేడుపులు.

ఈ యేడుపులను గురించే తెనాలి రామకృష్ణుడు తెలివిగా అన్నాడు. "అలసాని పెద్దన అటు ఇటు యేడ్చాడు, ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా ఏడిచాడు, భట్టుమూర్తి బావురని యేడ్చాడని" హృదయాన్ని కదిలించే యేడుపైతే రామకృష్ణుడామాట అనగలిగి ఉండడు. ఇది రామకృష్ణుడనినా అనకపోయినా నిజం మాత్రమంతే. ఆ యేడుపులు ఏడ్చిన తీరు చూస్తే వర్ణనలకు ఆహ్లాదం, ఉపమానాలకు సంతోషం మాత్రం కలుగుతుంది కాని వారియేడుపులకు సానుభూతి మాత్రం కల్గదు.

కలకంఠం వధూకలకాకలీధ్వనితోడి ఏడుపు తిమ్మన్నగారిది. ఎర్రెత్తియారాజీవనను ఏడ్పించాడు కాంభోజీ మేళవిపంచికారవంతో భట్టుమూర్తి.

"కవుల చమత్కారం ఈ ఏడ్పులను ప్రదర్శించడంలో వ్యక్తమౌతుంది." "నీరునిండిన తెప్పలదిమి కన్నులు గప్పికొన జూచి" ఆ ముఖాన్ని కవి దుర్దినపు మెట్టతామరతో బోల్చినాడు.

అదే మేఘసందేశంలో యక్షుడు మేఘునిలో "ఆ యబల కృచ్ఛముగ బ్రాణముల బిగబట్టికొని యుండ గుండె చెఱువై పోయి నీకు తప్పక కనుల నీరు జలజల రాలు" నంటాడు. ఈ గుండె చెఱువై పోవడం ఏడ్పుల్లో చాలపెద్దది.

శ్రీ C. R. రెడ్డిగారు ఈ ఏడ్పులోనిఒక దృశ్యాన్ని మనకండ్లముందు నిలిపాడు.

> లేనగవును కన్నీళ్లను
> గానెద తట తటయనంగ గాంతుని యెదుటన్
> వానయు నెండయు గలసెను
> చో నొప్పెడు వధుమనంగ సుందరినిలిచెన్.

ఆకవియే 'అంపకాలు' అనే శీర్షిక క్రింద మగవాని శోకాన్ని ఎంత మాధుర్యంగా వర్ణించాడో చూడండి. ఈ అంపకాల నాటి ఏడుపు ఆనందంతో కూడిన దుఃఖ మనవచ్చు. అది ఆపితే ఆగేదికాదు. పెండ్లికూతురు తరఫున కంట తడిబెట్టని స్త్రీ సామాన్యంగా అరుదు. ఆ సమయంలో చాలమంది మగవారు కూడ గుండె చిక్కబట్టుకోలేరు. ఈ కవిగారు ఆ తరగతితో చేరినవాడు. ఈ కుమార్తె ఏ కుమార్తె అయినా గానివ్వండి. ఆయన హృదయం విప్పిచూపాడు.

> ఘనతర కూర్మి బెంచిన
> తనయను నే ధార వోసి ధన్యుడనయ్యున్
> మునిగితి శోకార్ణవమున
> మనసునకున్ సుఖములేని మందిరమయ్యెన్.

ఇకలవంగిని కోలుపోయిన పండితరాయల దుఃఖాన్ని కనుగొనండి – "కన్నులనుండి జారి తోలుకాడు నవాంబుద వర్షధారలో నున్న కవీంద్రుడే యచలితోన్నతశైల వతకాద్రి పోలునో"

ఇక ఈ ఏడుపు సహజంగా స్త్రీలసొత్తు. సామాన్యంగా ఏడవని స్త్రీ ఉండదు. మగవాడు అరుదుగా ఏడుస్తాడు. ఏడుపును అదుపులో పెట్టుకునే శక్తి స్త్రీకన్నా మగవానికి ఎక్కువ అనటం నిస్సందేహం. కొన్ని పరిస్థితులలో కఠినంగా ఏడుపును దిగమింగే స్త్రీలు లేకపోలేదు. స్త్రీలు ఈ యేడుపును ఆయుధంగా వినియోగించుకోవచ్చు. కాని అది హద్దులుదాటితే అసహ్యకర పరిణామాలకు దారితీయవచ్చు. పగలల్లా పనిచేసి సాయంత్రానికి యింటికివచ్చే మగవానిని చిఱునవ్వుతో పలకరించే భార్యే స్వర్గం. అతని కష్టమంతా దానితో కరిగిపోతుంది. కాని ఏడుపు ముఖంతో ఇంట్లో ఏడుస్తు కూర్చుండే భార్యను చూసి ఏ మగవాడు భరించగల్గుతాడు! మగవాడికి ఏడిచే భార్యను చూస్తే కలిగే అసహ్యం ఇద్దరి శత్రువుల మధ్యకూడ ఉండదేమో? చిన్న పొన్న విషయాలకు ఏడుపు నెత్తిమీదనుండే స్త్రీ తనసంసారాన్ని నరకకూపంగా తయారుచేసుకుంటుందే కాని ఆనందనిలయంగా చేయలేదు. ఎప్పటికీ సహజంగా దుఃఖమనేది కష్టాన్ని సూచిస్తుందేగాని మరొకటికాదు. స్త్రీ ఏడుపును తగిన కాలంలోనే వినియోగించుకోవలె. విపత్కరపరిస్థితుల్లో ఎడుపును ఉపయోగించి ఇతరుల మనసును కరిగించగల జాణలెందరో ఉన్నారు. కాని వినియోగించడానికి ఏడుపు తెప్పించుకుంటే వచ్చేదికాదు. వచ్చినా అది స్వభావనైర్మల్యాన్ని చాటక కుటిలత్వాన్ని ప్రక్కవారికి పట్టిస్తుంది.

ఏడ్చే మగవాణ్ణి వెనక్కుతిరిగే దున్నపోతును నమ్మకూడదన్నారు పెద్దలు. మగవాడు సాధారణంగా ఏడవడు. తఱచు ఏడ్చే మగవాడిని మగవాండ్లే అసహ్యించుకోవడం సహజం. అతనిలో స్త్రీత్వం పాలు ఎక్కువ క్రిందనే జమకట్టబడతాడు. అతనికి గౌరవంకూడ అందరిలా ఉండదుకూడ. విపరీతమైన హృదయ భారాన్ని ఏడుపు దగ్గిస్తుంది స్త్రీకి సిగ్గు ఎటువంటిదో దాని ఆకర్షణ స్త్రీకెంత సహాయపడుతుందో ఏడ్పు నవ్వుకూడ అంతే సహాయకారులు అంటాడు హావలక్ ఎల్లిస్.

పసిబిడ్డల ఏడుపులోని మాధుర్యం చిఱునవ్వులోని తీయదనం తల్లికి తెలుసు. బిడ్డ ఏడుస్తుంటే తల్లిపడేబాధ తండ్రి పడడు కాని బిడ్డల నేడవనీయకుండ గొంతెత్తగానే పాలపీక నోటితో బెట్టే తల్లులుకూడ లేకపోలేదు. కాని బిడ్డకు ఏడుపువల్ల అనేకలాభాలున్నాయనే విషయం వారు తెలిసికొని ఉండరు. బాలురు ఆరోగ్యంగా ఉండడానికి కావలసిన గ్లాండ్సు కొన్ని ఏడుపువల్ల అభివృద్ధి జెందుతాయి.

అందువల్లనే బాగుగా ఏడవని పిల్లలు బాగుగా నవ్వలేరంటారు. అది వాస్తవం.

శారీరకంగా శక్తి తగ్గేటప్పటికి ఏడుపు ఎక్కువగావడం సహజం. మగవాండ్లలో కోపమెక్కువైతే స్త్రీలలో ఏడుపు ఎక్కువౌతుంది. కాని దీనికి సంపూర్ణంగా వ్యతిరేకోదాహరణలు లేకపోలేదు.

ఇక వేదాంతానికొస్తే అంతా దుఃఖమయమేనంటారు వేదాంతులు. నవీనులు మెట్ట వేదాంతమన్నా అది నిజమేమో ననిపిస్తుంది. నిజమైనా కాకపోయినా లోకంలో ప్రతిక్షణం జరిగేదే అది. దుఃఖభూయిష్టమైన జగతి ఆనందవంతం చేసుకోవడం మానవ ధర్మం. అందుకే మానవజననం,

జన్మదుఃఖం జరా దుఃఖం జాయాదుఃఖం
పునః పునః
సంసార సాగరం దుఃఖం తస్మాత్ జాగ్రత
జాగ్రతః

అన్నారు పండిత ప్రకాండులు అనుభవించి చూచి జీవితాన్ని ఆనందవంతం చేసుకోలేక—

# సంస్కృత భాషాభివృద్ధి

శ్రీమతి M. V. తాయారమ్మ

"ఎల్ల భాషలకును తల్లి సంస్కృతంబు" అని కొందరు విమర్శకుల అభిప్రాయము. సంస్కృత భాష దేవభాష. దాని లిపి దేవనాగరిలిపి. వ్యాకరణాది సంస్కారాలతో సంస్కరింపబడినందున దానికి సంస్కృతమనుపేరు సార్థకమైనది. ఈ భాష యేదేశానికి చెందినదికానందున దేశభాషలలో చేరదు. "ఆంధ్రులు, ఆంధ్రదేశము. అరవదేశము, అరవభాష. గుజరాతీ దేశము, గుజరాతీభాష. ఇంగ్లాండు దేశము, ఇంగ్లీషుభాష. రష్యాదేశము, రష్యన్ భాష. అమెరికా దేశము, అమెరికాభాష" అని ప్రపంచములో నాయాదేశాల పేరుతో నాయా భాషలు. వాటికి తగిన లిపి యేర్పడింది. కాని సంస్కృతభాష అమర లోకానికి చెందిన యమరుల భాష యగుటవల్ల అమరభాష అయినది. దీనికి మానవ లోకంలో ప్రచారమాగీర్వాణులే చేసి యుంటారు. ఎన్ని ప్రపంచ భాషలు వృద్ధిపొందినా గీర్వాణభాషా ప్రాశస్త్యము తగ్గలేదు. ఇది యేదేశానికి చెందినదికానందున వాఙ్మయంలోనే సువర్ణాక్షరాలతో నిలిచిపోయిందికాని ప్రజాబాహుళ్యంలో ప్రసారితముకాలేదు.

"ప్రవాహినీదేశ్యా" అని దేశభాషలో ప్రజల విజ్ఞాన వికాశాలతోపాటు వివిధములైన మార్పులు చెందుతూ విశృంఖల విహారంచేస్తూ విజృంభిస్తాయి. అమరభాష కటువంటి యవకాశాలేమీ లేనందున అది పుట్టిననాటినుండి ఒకేతీరుగా వ్యాకరణాది కట్టుబాట్లతో కట్టుబడిపోయింది. కాని బంగారము టంకం పాడితో అతకబడినట్లు సంస్కృత భాష యేభాషలోనైనా సులువుగా కలసిమెలసి అతుక్కుపోతుంది. దీనికిగల విసర్గలు దీర్ఘాలు తీసివేసి దేశభాషలకుగల ప్రత్యయాలను జతపరిస్తే వాఙ్మయానికొక భాండాగారమువలె పనిజరుగుతుంది. మచ్చుకి చూడండి. "రామః" అనే పదానికి విసర్గలు తీసివేసి తెలుగులో ఉత్వాదుజ్ఞులంచేరిస్తే "రాముడు" అనే రూపమేర్పడుతుంది.

హిందీలో "రామ" వరకు తీసికొని హిందీ ప్రత్యయాలు 'నే, కో' మొదలైనవిచేరిస్తే 'రామ్‌నే, రామ్‌కో' రామునితో, - రాముని అనే రూపాలేర్పడుతవి. ఈ విధంగా సంస్కృత పదజాలము ప్రపంచ భాష లన్నిటిలోనికి అపారంగా సంక్రమించింది.

ఆ తీరుగా చేరిన సంస్కృత ప్రాకృత పదాలను తత్సమ పదాలని వ్యవహరిస్తారు. తత్సమములనగా దానితో (సంస్కృతముతో) సమానమని యర్థము. విసర్గలు, దీర్ఘాలు తీసివేసిన గీర్వాణపదజాలమంతా తత్సమమే. ఉదా:_రాముడు, కృష్ణుడు, భక్తి, శక్తి, భగవంతుడు, ధనము, వనము, ఫలము, వర్షము మొదలైన వాడుకపదాలన్నీ, సంస్కృతములే. ఎంత మాత్రం చదువురానివారికికూడ అర్థమయ్యేటంత ప్రచారములోనున్న పదాలివి. ఎన్నో సంస్కృత క్రియా పదాలుకూడ తెలుగులో లీనమయిపోయాయి.

ఉ:_పోషించు, రక్షించు, గతించు, నిర్ణయించు, భుజించు, కరుణించు, మొదలగునవి క్రియలన్నీ సంస్కృత ధాతువులకు "ఇంచుక్" ప్రయోగము చేసినవే.

ఇవి కాకుండా తద్భవాలని కొన్ని పదాలున్నవి. ఆ సంస్కృత ప్రాకృత పదాలు వర్ణలోప వర్ణాగమ వర్ణప్రత్యయాలతో ననేక రూపాంతరాలనుపొంది తెలిసికోలేనంత సూక్ష్మంగా తెలుగు భాషలో కలిసిపోయిన పద బాహుళ్యం.

ఉ:_విష్ణువు - వెన్నుడు
లక్ష్మి - లచ్చి

శక్తి - సత్తి
రథము - అరదము

కుంభం - కుండ, మొదలగునవి ఎన్నో ఉన్నవి. ఇక సమాసాల విషయంలో నేభాషలోనైనా మక్కీకి మక్కీగా దేవలోకాన్నుంచి దిగుమతి చేసుకోవచ్చు. ఉ:—"మందార మకరంద మాధుర్యము"

"ఆకారజన్మ విద్యావరిష్ఠుడు"

శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతానంద సంధానుండు అనేవెన్నో, దీర్ఘసమాసాలు ఆంధ్ర వాఙ్మయానికి అలంకారంగా నిండి నిబిడీకృతమైయున్నాయి. సంస్కృత పదాల కింతటి బహుళ ప్రయోగంకలగడానికి కారణం ఆ భాషలోగల అర్థశక్తి, భావగాంభీర్యము. శ్రవణ సుఖము మొదలగునవి కావ్య గుణము లుండుటే. తెలుగు వ్యాకరణముకూడ నన్నయభట్టు "ఆంధ్ర శబ్ద చింతామణి" సంస్కృతములోనే రచించాడు.

కేవలం అచ్చ తెనుగుభాష తీసికొంటే దానికి అక్షరాలు 36 మాత్రమే. తత్సమ సంకలితము కాకుండా పట్టి సంభాషణ సాగించినా అందరికీ అర్థం కాదు. ఇంక గ్రంథాలు చదువాలంటే ఆంధ్రనామ సంగ్రహం ముందు చదవాలి. అందువల్ల వాడుక భాషలోకూడ నూటికి 50 పదాలు తత్సమ తద్భవ పదాలే కనబడుతవి. ఆంధ్రలో సంపూర్ణ పాండిత్యం సంపాదించాలంటే సంస్కృత భాష చదివి తీరాలి. ఇతర దేశ భాషలకంటే తెలుగు భాషకు సంస్కృత సాహచర్యం చాలా ఎక్కువ. ఆ కారణంచేతనైనా మన యాంధ్ర భూమిలో సంస్కృత భాషను విరివిగా వ్యాపింపజేయాలి.

ఆధ్యాత్మిక విషయానికి సంస్కృతమే పునాది. పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకొని మోక్ష సామ్రాజ్యాన్ని పొందగోరిన ముముక్షువునకు సాధనాలైన "భగవద్గీత" మొదలగునవి ఉత్తమ వేదాంత గ్రంథాలన్నీ సంస్కృత భాషలోనే యున్నవి. ఆ గ్రంథాలను ఎంత తెలుగులోనికి తీసికొనివచ్చినా మూలంలోని మెరుగులు భావాలు తెలుసుకోవాలంటే ఆ భాషలో పాండిత్యం చాలా అవసరం. హిందు మతానుసారం మానవ జీవిత పరమార్థాన్ని పొందడాని కింతకంటే వేరుమార్గంలేదు. మన భారత భూమిలో విశేష ప్రత్యేకత పొందిన దేవాలయాలలో దేవతాపూజకు సంబంధించిన వాఙ్మయమంతా సంస్కృతమయమే. పూజా విధానము సంకల్పము మొదలు ఉద్వాసనవరకు సంస్కృత శ్లోకాలలోనే యుంటుంది. పూజలకు సంబంధించిన అష్టోత్తర శత నామాలు, సహస్రనామాలు, దేవదేవతా స్తోత్రాలు అన్నీ సులభంగా నోటితో ఉచ్చరించటాని కనుకూలంగా శ్లోక రూపంలో రచించారు. వేద వేదాంగాలు వ్యాకరణాది శాస్త్రాలు అన్నీ దేవభాషా స్వరూపాలే. మన ప్రాచీన భారతీయ విజ్ఞానము, సంస్కృతి, వికాసము, జాతీయ జీవనము సంస్కృత భాషా గ్రంథాలలోనే కనబడుతుంది.

భోజరాజు కాలములో సంస్కృతము రాజభాషగాను వాడుక భాషగాకూడ నుండేదని ప్రతీతి. నేటివరకు సంస్కృతభాషాభ్యసనానికి మూల గ్రంథాలైన మహాకవి కాళిదాసు రచించిన రఘువంశము, కుమార సంభవము, మేఘ సందేశము, శాకుంతల నాటకము మొదలైన గ్రంథాలన్నీ ఆ కాలంలో బయలుదేరినవే. అప్పట్లో సంస్కృతము ఎంత సుగమంగా మాట్లాడేవారో చూడండి. ఒక పండితునకు పాఠశాలకు వెళ్లే బాలికకు జరిగిన సంభాషణ.

"కస్త్వం బాలే కాంచనమాలా
కస్యాః పుత్రీ కనకలతాయాః।
కింతే హస్తే తాళీపత్రం
కావా రేఖా కఖగఘ"

అని కఖలు నేర్చుకొనే విద్యార్థిని యింత చక్కగా మాట్లాడగలిగితే యిక పెద్ద చదువు చదివేవారెలా యుంటారో యూహించుకోవచ్చు.

చమత్కార [illegible] చాటువులలోకూడా ఎంతో పాండిత్యం కనబడుతుంది.

''విరాటనగరే రమ్యే కీచకాదు పకీ
చకం
అత్రక్రియా పదంవక్తుం హైమందా
స్వామి కంకణం''

ఈ శ్లోక పాదంలో క్రియాపదమేదో చెప్పిన వారికి బంగారు కంకణము బహుమతి చేస్తానని సవాలు చేస్తున్నాడు కవి.

విః = పక్షి ; ఆట = సంచరించెను అని పద చ్ఛేదంచేస్తే సుందరమైన నగరంలో ఒక పక్షి ఒక వెదురునుండి మరొక వెదురుమీదికి ఎగిరెను అని అర్థం వస్తుంది. బంగారు కంకణము. హైమం = మంచు సంబంధమైన, కం = నీటి, కణం = బిందువు, నీటి చుక్క అని అర్థము చెప్పవచ్చును. ఇటువంటి చమత్కార శ్లోకాలలో ఎంతో పాండిత్య ప్రకర్ష చూడగలము. చిన్న పదాలలో చక్కని భావాలను ఇమడ్చడానికి అవకాశమిచ్చే భాష ఇది. ఒక అక్షరానికి వేరు వేరు అర్థాలు చెప్పుకోవచ్చును. భావానికి రసానికి తగిన పడికట్టు పదాలు కావలె నంటే సంస్కృతమే దిక్కు. వీరభయానకరౌద్ర రసాలను వర్ణించే పట్టులో సంస్కృత సమాసాలు వాడకపోతే ఆ రసం నీరసమౌతుంది. తెలుగుభాష తేలితేలిపోతుంది. ఈ యమరభాషను కొందరు మృతభాషగా పరిగణిస్తారు. వారికా భాషలో ప్రవేశం లేనందున యందులోని మాధుర్యాది గుణాలు తెలియకపోవడంవల్ల చెప్పే మాటలేగాని తెలిసికొన్న తరువాత తమ భావాలను తప్పకుండా మార్చుకోగలరు. వేయేల మన దేశంలో మానవుడు పుట్టినది మొదలు మరణించేవరకు జరిపించే షోడశ కర్మలకు సంస్కృతమే ఆధారము.

మన స్వతంత్ర భారతదేశంలో సంస్కృత భాషను పునరుద్ధారణచేయాలని మన ప్రభుత్వమువారు తల పెట్టడము చాలా యభినందనీయము. ప్రతి పాఠ శాలలో సంస్కృతం విధిగా చదివించవలెనను ప్రతి పాదన చాలా ముఖ్యము. తప్పకుండా చదువవలె నసే నియమం లేకుండా ఐచ్ఛిక భాషగాచేస్తే ఎవ్వరూ దాని జోలికిపోరు. కనుబొమ్మలమీది వెంట్రుకలవలె ఎప్పటివలెనే యుంటుంది. ప్రస్తుత కాలంలో సంస్కృత భాషాపరిచయము చాలా తక్కువగా నుండుటవలన భయపడుతున్నారేకాని వేరొకటికాదు. ఇందీ ఇంగ్లీషు భాషలను వృద్ధిచేసి నట్లుగా సంస్కృతములో చిన్న చిన్న పదాలతో ప్రారంభమయ్యే "రీడర్సు" వాచకాలు తయారు చేయించాలి. దశవిధ లకారాలలో ముఖ్యమైన భూత భవిష్య ద్వర్తమాన కాలాలలో మూడు నాలుగు, లట్, విట్ లఙ్, లుఙ్ లకారాలు మాత్రమే ఉపయోగించి తేలిక పదాలతో చిన్న చిన్న కథలువ్రాస్తే విద్యార్థులకు భాష సులభమవ డమే కాకుండా చదువవలెననే యభిలాష వృద్ధి పొందగలదు. సంస్కృతము పేరెత్తగానే యదేదో యయోమయముకాకుండా యందుబాటులోనికి తీసుకు రావాలి.

అన్నిటికంటె "ధనమూల మిదంజగత్" అను నట్లే భాషలో బాగా మార్కులువచ్చిన విద్యార్థులకు విద్యార్థి వేతనాలిచ్చుట, అమరకోశము, రఘువంశ ములలోని శ్లోకాలను శబ్దమంజరిలోని శబ్దాలను, భర్తృహరిసుభాషితాలు, కృష్ణాష్టకము, లక్ష్మీ అష్టకము, కృష్ణ, రామ, లక్ష్మీ, శివ మొదలైన అష్టోత్తర శతనామస్తోత్రాలను, శ్యామలా దండకము మొదలైన దేవీదేవతా స్తోత్రములను కంఠస్థము చేసిన వారికి బహుమతుల నిచ్చుట మొదలగు నుత్సాహకర మైన క్రియలవలనకూడ విద్యార్థులలో సంస్కృత భాషా పఠనా శక్తి కలుగుతుంది; వ్యాసరచనలు, వక్తృత్వపోటీలుకూడ జరుపవలెను. ఈ ప్రక్రియ బాలికలకు గొప్ప యుపయోగకారి కాగలదు. పెద్ద వారైన తర్వాత కొందరికి నిత్యపూజలు వ్రతాలు చేసుకొనునప్పుడు వీని యుపయోగము కనబడుతుంది. కంఠస్థముచేయుట అలవడినవారికి మంచి ధారణాశక్తి కలుగుతుంది. దేవతా స్తోత్రపాఠాలు వల్లించినందున భాషాభివృద్ధియేకాక పూర్వజన్మ సంస్కారముగల బాలబాలికలకు దైవభక్తి బాల్యంలోనే అబ్బుతుంది.

క్రొత్తబట్టకు రంగుపట్టినట్లుగా బాల్యంలో నాటబడిన భక్తిబీజాలు కాలాంతరముల వృక్షాలై ఫలితాల నీయగలవు. నాస్తికవాదుల వాతావరణంలో దిక్కుతోచక మనమెవరమో ఎలావచ్చామో ఎందుకు జన్మించామో ఏమవుతామో తెలియకుండా కొట్టుమిట్టాడుతున్న నేటికాలపు విద్యార్థులకు కనువిప్పు కలుగుతుంది. మరిన్ని సంస్కృత పుస్తకాలు అందరికీ అందుబాటులో నుండేటట్లు చౌకధరలకు అమ్మించే యేర్పాట్లు చేయించవలెను. ప్రస్తుతము నూటికి ఇరవై Pass మార్కులుగా నిర్ణయించిన మంచివి. విద్యార్థుల కభిరుచికలిగినకొద్దీ నూటికి నూరు మార్కులు సంపాదించగలుగుతారు.

మరొక ముఖ్యవిషయము. భాషాభివృద్ధి చేయవలెనంటే ముందు పాఠశాలలను తరువాత ఉపాధ్యాయులను సరిదిద్దుకోవాలి. ప్రస్తుతము సంస్కృతానికి ప్రాధాన్యంగల సంస్కృత పాఠశాలలలో పనిచేసే యుపాధ్యాయులకిచ్చు గ్రాంటు సగము మాత్రమే. ఇది చాలా శోచనీయము. ఇటువంటి పాఠశాలలలో పనిచేస్తూ యెంతకాలం అర్ధాకలితో నుండగలరు? సంస్కృతభాషామతల్లిని హేమ సింహాసనమెక్కించి గౌరవించునప్పుడైనా పండితులను సమానాదరముతో చల్లని చూపు చూడడము సమంజసము. మరియు సంస్కృత పాఠశాలలను పైజెప్పిన పోటీ పరీక్షలకు వ్యాసరచనపోటీలు, వక్తృత్వపోటీలు మొదలైన అభివృద్ధి కార్యక్రమాలు జరిపించే కేంద్రాలుగా చేసిన యెడల సత్వరముగా భాషాభివృద్ధి కాగలదు. మన కాంధ్రరాష్ట్రము సిద్ధించినందున భాషను పెంపొందింపజేసికొనుట చాలా అవసరము. ముందుకి విశాలాంధ్ర కాబోతూవుంది. ఇటువంటి తరుణంలో సంస్కృతభాషనున్నతికిదెచ్చి యాంధ్ర భూమిని పటిష్ఠమైనదానినిగాజేసి రాష్ట్రమును చిరస్థాయిగా నొనరింపజేసికొనుటత్యంతావశ్యకము. భాషాభివృద్ధి వలనగాని దేశము ప్రకాశింపనేరదు. దేశీయులకిత్తోధికముగా బుద్ధి వికాసము కలిగినగాని దేశౌన్నత్యము చేకూరదు. మనజాతిని సంస్కృతిని విద్యను ఏకము జేసిననాడే దేశమునకు పరిపూర్ణత సిద్ధించగలదు.

---

ఒక వారకాంత విటునితో "గురవయ్యగారూ! మీరు మీసాలు తీసేస్తే ఎంతో అందంగా కనుపిస్తారండీ" అన్నది.

"ఒక్క మీసాలేమిటి! - తిరుపతి మొక్కు తీర్చుకోడానికి పోయినప్పుడు తల సయితం గుండుచేయించుకొని నీ కడ కొస్తాను - అప్పుడుచూడు నా అందం" అన్నాడు గురవయ్య.

యం. వి. రమణమ్మ

---




సీరియల్ కథ

# విజయలక్ష్మి

శ్రీ పిళ్ళా సుబ్బారావుశాస్త్రి

[అగ్నిసింహుడు సింహకోటరాజు, పట్టి క్రూరుడు. ఒకసారి అగ్నిసింహుడు సాగర రాజ్యంమీద పడి దాన్ని వశపర్చుకున్నాడు. సాగర రాజు విజయవర్మకి సంవత్సరంన్నర కొడుకు, తల్లిలేని మూడు మాసాల కూతురువున్నారు. అతని మంత్రి కొడుకుని తీసుకొని పరారీ అయిపోయాడు. కాని రాజుమాత్రం కూతురితో అగ్నిసింహుడికి దొరికిపోయాడు. అగ్నిసింహుడి జాతకంలో తనకి అమ్మాయివల్ల మరణం వున్నదని వుంది. ఆ అమ్మాయే తనని చంపవచ్చుని, యిద్దరినీ చిత్రవధ చెయ్యమన్నాడు అగ్ని. – ఇద్దర్నీ చంపే సమయంలో కొందరు కొండవాళ్ళు సేవకుల్ని చంపి, రక్షించారు. కాని విజయవర్మ పాపాయిని వాళ్ళకప్పజెప్పి రాచబిడ్డ గుర్తుగా రత్నాలహారం యిచ్చి మరణించాడు.– కోయరాజు, రాణీ ఆ పిల్లని యింటికి తీసుకువెళ్ళడంతో, వారు హఠాత్తుగా ఒక రాజ్యాన్ని జయించారు. ఆ విజయానికి ఆ పాపాయే కారణమని, ఆ పాపాయికి విజయలక్ష్మి అని పేరుబెట్టారు.– విజయవర్మ మంత్రి ఆ కుర్రాణ్ణి కేసరపురి రాజుకి యిచ్చాడు. ఆ రాజు పిల్లలు లేనందున అ కుర్రాణ్ణి పెంచుకోసాగాడు. వర్మ కొడుకు సాగర సింహుడు యిక్కడ దుర్గుణాలతో పెరగసాగాడు. – ఇంక విజయలక్ష్మి పెద్దదయి అన్ని విద్యలూ నేర్చుకుంది. ఒకరోజు లక్ష్మిని ఒక రాక్షసి ఎత్తుకుపోయింది. కాని విజయ ఉపాయంతో దాన్ని చంపి, తనతోపాటు తొంభైతొమ్మిదిమంది రాకుమార్తెలను రక్షించింది. ఆ రాజకుమార్తెలంతా విజయని తమ రాజ్యాలకు రమ్మన్నారు – కాని అవసరమయినప్పుడు సైన్యాన్ని పంపమని, అప్పుడు వస్తానని చెప్పి పంపేసింది వార్ని – ఇక చదవండి]

(గతసంచిక తరువాయి)

విజయలక్ష్మి వున్న కోయరాజ్యానికి దగ్గరగానే వుంది కేసరపురి. కేసరపురి రాజు విజయక్ష్మి అన్నఅయిన సాగర సింహుడని మీకు తెలుసుకదూ!

అది పెద్ద తెల్లగుర్రం ....! ఆ గుర్రం కేసరపురి రాజుది....! దాని నెవరూ అడ్డగించకూడదు, అడ్డగించలేరు కూడా...!

ఆ గుర్రం రాజ్యంలోని పిల్లలందర్నీ కుమ్మేసుకుంటూ, కోయరాజ్యంలోకి చొరబడింది. అది చంటిపిల్లల్నీ, ముసలాళ్లని తొక్కుకుంటూ పోతూంటే విజయలక్ష్మి వెళ్ళి దాన్ని ఆపేసింది!

విజయలక్ష్మి ఆ గుర్రాన్ని తన గుర్రాల శాలలో బంధించేసింది. – ఇది సాగరసిం

హుడు విని మండిపడ్డాడు. " హేయ్ ...! దానిని బంధించి తీసుకురండి .... ! " అంటూ ఆజ్ఞాపించాడు సాగర్.

విజయలక్ష్మిని రాజభటులు బంధించి తీసుకువచ్చారు. సాగరసింహుడు విజయలక్ష్మిని చూశాడు.

" గుర్రాన్నెందుకు పట్టుకున్నావ్ ? " అని ప్రశ్నించాడు.

" పట్టుకునే అవసరం వచ్చింది కాబట్టి పట్టుకున్నాను ... ! "

"అది రాజుగారిగుర్రం అని తెలీదా?"

"తెలుసు...! ఎందుకు తెలీదూ !"

" తెలిసివుండే పట్టుకున్నావా ?"

" అవును ... ! "

" ఆఁహాఁ...! ఎంతధైర్యం...! ? "

"ఏం! ఆశ్చర్యంగా వుందా? నేను భారత స్త్రీని ... ! భారత దేశంలో పుట్టిన వీర నారిని ... !! "

" అహ్హాఁహాఁవా ...! - దాన్ని నా గదిలోకి తీసుకుపొండి ...! " అంటూ విషపునవ్వు నవ్వేడు సాగరసింహుడు.

" అమ్మాయ్ ... నన్ను పెళ్లిచేసుకున్నావంటే, ఈ సర్వసామ్రాజ్యానికి రాణిని చేస్తాను. "

"ఛీ ... ! నీచుడా ... దూరంగా వుండు!" అంటూ విజయలక్ష్మి గోడనున్న ఒరలోనుంచి కత్తి దూసింది సాగరసింహుడి మీదకి.

"హాఁయ్ .. !" అంటూ కత్తితో మీద కురికాడు సాగరసింహుడు. పాపం! ఒక దెబ్బతో దొర్లుకుంటూ మెట్లమీద పడ్డాడు !

"పట్టుకోండి...! దాన్ని బంధించండి ...!" అంటూ అరవసాగాడు సాగరసింహుడు.

" ఆగండి...! దగ్గరకొస్తే యమలోకానికి పంపుతాను ...! పదండి, మీ వెనుకనే వస్తాను...! " అంటూ విజయ గర్జించేవరకు భటులు కారెత్తారు.

తనంతటతానే జైల్లోకి వెళ్ళింది విజయ. లోపలికి వెళ్ళిన తర్వాత తలుపులు బిగించారు సేవకులు.

"సాగర్...! అలా, స్త్రీలని బాధపెట్టకూడదు...!న్యాయంగాబ్రతుకు.. " అంటూ చెప్పాడు వణుకుతూ పెంచి పెద్దచేసిన మంత్రి.

" ఎవరు నువ్వు? నాకు నీతులు చెప్పొచ్చావ్.. ?"

"ఎవరినా?- కళ్ళు కామెర్లుగమ్మేయా? కనిపించడంలేదూ? నిన్ను చిన్నప్పట్నుండీ, పెంచి పెద్దవాణ్ని చేసిన మంత్రిని...!"

"నోర్ముయ్...! వీళ్ళి బంధించండి!" అంటూ సాగరసింహుడు ఆజ్ఞాపించగానే మంత్రిని బంధించేసారు.

విజయలక్ష్మి చరశాలలో వుండి చూస్తోంది. అటు మంత్రి వున్నాడు. ఇటు ఎవరో లావుగా, నల్లగా పెద్దవాడొకడు వున్నాడు. వాడిచుట్టూ కాగడాలు మండుతున్నాయి ... !

అక్కడికి వెళ్లి "ఎవరు నువ్వు ?" అని అడిగింది వాడు "నేను యీ రాజ్యంలో వుండే సేనానిని . ! నాపేరు భీమబల్ అంటారు ... ! ఈ యువరాజు నన్ను కొన్ని కారణాలవల్ల బంధించాడు ... ! నాకు నిప్పంటే భయం...! లేకుంటే ఎంత మందినయినా చంపేయగలను . !" అన్నాడు.

తర్వాత కేసరపురిమీదకి కొన్నిలక్షల సైన్యంతో అగ్నిసింహుడు యుద్ధానికి రాసాగాడు. దాంతో అందరూ భయపడసాగారు...!

అగ్నిసింహుడు పేరు వినగానే భగ్గున మండిపోయింది విజయలక్ష్మి...! కోయ రాజు తనకి చెప్పిన సంగతి జ్ఞాపకం వచ్చింది.

అగ్నిసింహుడు కేసరపురిని ఆక్రమించుకున్నాడు - సైనికులు జైలులో వాళ్ళని వదిలిపెట్టేసి పారిపోయారు. విజయలక్ష్మి భీమబల్ చుట్టూవున్న కాగడాల నన్నిట్లనీ తీయగానే భీమబల్ "రాణి! ఇప్పుడు నన్నేం చెయ్యమన్నారో చెప్పండి .. !" అన్నాడు.

"నాతో రా...! అగ్నిసింహుణ్ని హతమారుద్దాం" అంటూ తీసుకుపోయింది.

విజయలక్ష్మి కొందరి కొండ వాళ్ళచేత తొంభై ఎనిమిది మంది రాజకుమార్తెలకీ సైన్యం కావాలని కబురు పంపింది.

ఇంకేముందీ, ఎన్నో లక్షలమంది సైనికులు వచ్చేశారు ...! కేసరపురిలో రక్తం కాల్వలు గట్టింది.

అగ్నిసింహుడు సాగరసింహుణ్ని బంధీ చేశాడు. యుద్ధం ఘోరంగాజరుగుతోంది.

యుద్ధరంగంలో అమ్మాయిని చూడగానే అగ్నిసింహుడు వణికిపోయాడు.

"భీమబల్ ...! అగ్ని సింహుడి సైన్యాన్ని నాశనంచెయ్యి...!" అంటూ ఆజ్ఞాపించింది విజయలక్ష్మి.

భీమబల్ నల్లగా, లావుగా, పదడుగుల ఎత్తుకలిగి వుంటాడు. పెద్ద గ్రద్దలాగ సైన్యంమీద పడి కబళించివేయసాగాడు. భీమబల్ని చూసి పరిగెత్తసాగారు సైనికులు ... !

అగ్నిసింహుడికి, విజయలక్ష్మికిఘోరంగా యుద్ధం జరుగుతోంది. అగ్నిసింహుడి

సైనికులంతా తగ్గిపోసాగారు.

వింధ్య, చంద్ర, రత్నా అంతా తమ తమ సైనికులతో వచ్చేశారు. అగ్నిసింహుడి సైన్యాన్ని పూర్తిగా హతమార్చేరు.

వెనకపాటుగావచ్చి అగ్నిసింహుణ్ణి పైకిఎత్తి గిరగిరా తిప్పి దఢీమని ఎత్తిపడేసాడు భీమబల్, విజయలక్ష్మి కాళ్ళదగ్గర..!

"అమ్మా...!" అన్నాడు కొన ఊపిరితో అగ్ని.

"హుం ...! మా నాన్నగారిని చంపినప్పుడో ...!" అంటూ గుండెలమీద కాలువేసి మేడమీదనుండి క్రిందకు తన్నేసింది.

"మహారాణీ...!" అన్నాడు భీమబల్ సాగరుని పైకెత్తి. అంతలోనే మంత్రి, కోయరాజులువచ్చి "ఆగు..!" అంటూ అరిచారు. "సాగరసింహుణ్ని క్రిందుకి దింపారు. ఆమె నీ చెల్లెలు....!" అంటూ చెప్పాడు మంత్రి.

"చెల్లాయీ..." అంటూ కాళ్ళమీద పడ్డాడు సాగరసింహుడు. తర్వాత అంతా విజయవర్మ సమాధి దగ్గరికివెళ్ళి పూలమాలలు వేశారు. విజయలక్ష్మి రాజకుమార్తె అని నమ్మడానికి రత్నమాల అందరికీ చూపించారు.

"విజయా...! నిన్నొక్క కోరిక కోరుతున్నాను...!" అంది రత్న.

"ఏమిటది?" అంది విజయలక్ష్మి

"మా అన్నయ్య ఉదయసింహుణ్ని వివాహం చేసుకోవాలి ...!"-విజయలక్ష్మి ఉదయుణ్ని చూసింది. యుద్ధంలో తన ధైర్య పరాక్రమాల్ను ప్రదర్శించిన అందమయిన వీరుడేనని గ్రహించింది. సిగ్గుతో తలవంచుకుంది.

"రత్నా! నీ కోరిక మా రాణీ తీర్చినప్పుడు మా రాణీ కోరికప్రకారం, మా యువరాజు సాగరసింహుణ్ని తమరు ...." అని ఆపేశాడు మంత్రి.

ఒక శుభ ముహూర్తాన విజయలక్ష్మికి ఉదయసింహుణ్ని యిచ్చి, సాగరసింహుడికి, రత్ననిచ్చి మహా వైభవంగా వివాహం జరిపారు.

"విజయలక్ష్మి మనకందరికీ ఆదర్శస్త్రీ..! ఆమెవల్లనే ఎంతమందో రాకుమార్తెలు బ్రతికారు....! ఆమెవల్లనే ప్రజాపిశాచి అగ్నిసింహుడు మరణించాడు ...! ఆమె భారత వీరనారులలో ఒకర్తె ...!" అన్నాడు మంత్రి.

జయజయ ధ్వనులు మ్రోగినై ...!

"జై! విజయలక్ష్మి దేవికీ జై ....!" అంటూ ప్రజలు నినాదాలు చేశారు ....!



# పల్నాటి వీర చరిత్ర

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

ఈ కథయొక్క పూర్వస్థితిని తెలుసుకోవలసింది. పల్నాటి యుద్ధం క్రీ. శ. 1176-1182 ♦ మధ్య జరిగి ఉంటుంది. అటు తర్వాత రెండువందల ఏండ్లకుగాని శ్రీనాధుడు జన్మించలేదు. అప్పటి వరకు ఈ కథ సంగతేమిటి? జంగం కథల స్వభావమేమంటే, చారిత్రక ఘటనలు జరిగినతోడనె జంగం కథలు రచించబడతాయి. అట్లే జంగం కథకూడ ఒకటి 1182 ప్రాంతంలో రచించబడి ఉండాలి. అప్పటికి శ్రీనాధునికి పూర్వమె ఏదైన రచన ఉండేదా అను సమస్యను ఆలోచించవలసుంటుంది.

శ్రీనాధుడికి సుమారుగా ఒక పురుషాంతరం పూర్వపు వాడైన రావిపాటి త్రిపురాంతకుడు (క్రీ. శ. 1350 ప్రాంతం) సంస్కృతంలో ప్రేమాభిరామం అను వీధినాటకాన్ని రచించేడు. అది ఇప్పుడు లభించడం లేదు. కాని దాని అనువాదం లభిస్తూంది. అది శ్రీనాధకృతమని కొందరు, వల్లభరాయకవి కృతమని కొందరు వాదించుకొంటారు. ఆ అనువాదం పేరు క్రీడాభిరామం. దానిలో పల్నాటి వీరకథను వీరులు నటించడం, పాడడంకూడ విపులంగా వర్ణించబడ్డాయి. వాటిలోని రెండు పద్యాలు.

ఆ. వె. అరువల్లినాయి నారి దుర్మంత్రంబు,
కోడిపోరు, చాపకూటి కుడుపు,
ప్రథమ కారణంబులు, పల్నాటియే కాంగ
వీర పురుష సంప్రహారమునకు.

మ. ద్రుత తాళంబున వీరగుంఫిత కథం
దుంధుం కిటాత్కార సం
గతి వాయింపుచు నాంతరాలిక
యతిగ్రామాభిరామంబుగా
యతికూడం, ద్విపద ప్రబంధమున
వీరా నీకముం బాడె నా
కృతె ప్రత్యేకముగా, కుమార
కులు వీట్కారంబునన్ దూలగన్.

సంస్కృత మూలంలో ఉన్న శ్లోకాలను క్రీడాభిరామకవి స్వేచ్ఛగా తెనింగించి ఉంటాడని తలవవచ్చు. కాబట్టి శ్రీనాధుడికి పూర్వమె పల్నాటి వీరకథ ద్విపద గేయంగా ఉండేది. ఆ పుస్తకంలోని కొంత భాగాన్ని గ్రహించి శ్రీనాధకవి పల్నాటి వీరచరిత్రను రచించేడని నిర్ణయించవచ్చు. కాబట్టి పల్నాటి వీరచరిత్రలో అనేక తబిసీళ్లు కనబడుతున్నాయి. ఆ నాటి రాజులపేర్లు, ఘటనలు వివరంగా ఉన్నాయి.

## సమకాలపు రాజకీయచరిత్ర

మధ్యాంధ్రదేశము, ఉత్తరాంధ్రదేశము మూడవ కులోత్తుంగ చోళదేవ చక్రవర్తి (క్రీ. శ. 1178 - 1216) పరిపాలనలో ఉండేవి. అతను చాళుక్య చోళ చక్రవర్తులలో ఆరోవాడు, ఆఖరివాడుకూడ.

♦ చిలుకూరి వీరభద్రరావుగారి కాకతీయాంధ్ర రాజయుగచరిత్ర, పుట 420. క్రీ. శ. 1178-85 మధ్య జరిగి ఉంటుందని ఒక చరిత్రకారుని అభిప్రాయం - J. A. H. R. S. Vol. 19 P 34.

ఆ రాజు ఆంధ్ర దేశాన్ని అరవదేశాన్ని కూడకలిపి పాలించేడు. అతని తర్వాత ఆంధ్ర దేశంలో మహామండలేశ్వరులైన వెలనాటి చోళరాజులు రాజ్యం చేసేవారు. వారు మూడో గొంకభూపతి (క్రీ. శ. 1178 - 1185), అతని కొడుకు పృథివీశ్వరుడు (క్రీ. శ. 1185 - 1207). చాళుక్య చోళ చక్రవర్తి కాలంలోనే రాజ్యపతన ప్రారంభించడంవల్ల అనేక చిల్లర రాజులు తలశక్తి బలం చేకూర్చుకొంటూవచ్చేరు. పొత్తపినాటిని పరిపాలిస్తున్న తెలుగు చోళులు నెల్లూరుని ముఖ్య పట్టణంగా చేసుకొన్నారు. వీరికి కమ్మనాటినుంచి, పొత్తపినాటి వరకు ఉండే చోడులు సామంతులుగా ఉండేవారు. అప్పటి నెల్లూరి పాలకుడు మొదటి మనుమసిద్ధి రాజు. అతని కుమారుడు తిక్కరాజు ప్రతాపవంతుడు. ఇతను 1207 లో గూడూరువద్ద వెలనాటి పృథివీశ్వరుడితో యుద్ధంచేసి గెలిచేడు.

పల్నాటిలో అనుగురాజు పుత్రులు రెండు కక్షలయేరు. ఒక కక్షకి నాయకురాలు అధికారిణి; రెండో కక్షకి బ్రహ్మనాయుడు పెద్ద. వారు చేసిన పల్నాటి యుద్ధం (1178 - 82) చరిత్ర ప్రసిద్ధి పొందింది.

ఉత్కల దేశంలో మహేంద్రగిరివరకు ఉన్న పృథివీశ్వరుని రాజ్యం శిథిలమవుతూంది. అక్కడి కటక గాంగరాజులు పృథివీశ్వరుని రాజ్యంలో ఉత్తర ప్రాంతాన్ని కబళించ దలచుకొన్నారు. ఆ పని 1207 ప్రాంతాలకు పూర్తయింది.

కాకతి రుద్రరాజు వరంగలు రాజ్యాన్ని పెంపు చేసుకొంటూవచ్చేడు. అతను పడమటివైపు దేవగిరిరాజులతో యుద్ధంచేస్తు, 1196 ప్రాంతాలలో మరణించగా, అతని తమ్ముడు మహాదేవరాజురాజై నాలుగు సంవత్సరాలపాటు పాలించి, దేవగిరి రాజులతో చేసిన యుద్ధంలో మరణించేడు. అతని కుమారుడు గణపతి దేవుడు దేవగిరి చెరలోఉండి క్రీ. శ 1209 ప్రాంతాలలో విముక్తుడయ్యేడు. అతను రాజ్యానికి వచ్చేటప్పటికే వెలనాటి పృథివీశ్వరుడు అంతమొందేడు. గణపతిదేవుడు వీరశిఖామణి. కాబట్టి తెలుగుదేశం చాళుక్య చోడ చక్రవర్తుల చేతులలోంచి గణపతిదేవుడి చేతిలోకి మారింది. ఇట్లు వెలనాటి చోడుల పరిపాలన అంతమొందింది.*

## చారిత్రక దృష్టి

సామాన్య జనులదృష్టిలో బ్రహ్మనాయుడు ఒక మహావీరుడు. కాని చారిత్రక దృష్టి దానికి భిన్నంగా ఉంది. ఏకాండిగా ఉన్న రాజ్యాన్ని రెండు ముక్కలుగా విభజించగోరేడు బ్రహ్మనాయుడు. అట్టి విభజనవల్ల పోరుతప్ప మరేమీ లాభంలేదని చరిత్ర ఘోషిస్తూంది. అట్లుగాక నాయకురాలు రాజ్య విభజనకు వ్యతిరేకంగా పనిచేసింది. చారిత్రక దృష్టిలో ఈమె చేసిన పనే మేలుగావుంది. కాని జంగం కథారచనలలో అటువంటి దృష్టి కనబడదు. జనుల దృష్టిలో బ్రహ్మనాయుడే పేరు పొందేడు. సామాన్యజనుల దృష్టి అనేకవిధాలగా ఉంటుంది. దానికొక పద్ధతి లేదు. కొన్నిటిలో దూరదృష్టి ఉన్నట్లుగా కనబడుతుంది. మరికొన్నిటిలో హ్రస్వదృష్టి స్పష్టమవుతుంది. బ్రహ్మనాయుడి ఘనతకు అతని మత సాంఘిక సంస్కరణలు కొంత కారణమయేయని చెప్పక తప్పదు. అతను రాజకీయ వేత్తగా గాక ఇతర విధాలగా ఘనుడని చెప్పవలసివస్తూంది.

పల్నాటి వీరయుద్ధంలో రాజనీతి అంతగా కనబడదు. శత్రువులు అలరాజును అన్యాయంగా చంపేరు. కాబట్టి వారిమీద వీరు కక్ష తీర్చుకోడమే ముఖ్యమయింది. వేరే రాజనీతి లేదు. రాయబారుల మాటలను విని బ్రహ్మనాయుడు సంధికి సుముఖుడై ఉండగా బాలచంద్రుడు అంతా ధ్వంసం చెయ్యడానికి అక్కడ అవతరించేడు. ఆ క్షుద్రవాడి మాటల

* భారతి, జూన్ 1953.వ సంచికలోని ముమ్మడి కులోత్తుంగ చోళుడు.

•డిటో — డిటో 540వ పుట

వల్ల యుద్ధం పొసగింది. బాలచంద్రుడు తన చావును కోరి తెచ్చుకున్నాడు.

## జంగం కథా లక్షణాలు

జంగంకథలోని ముఖ్యవీరులు అతిలోక పురుషులుగా ఉండాలి. దానిని అనుసరించి బ్రహ్మనాయుడు ఆదినారాయణుని అవతారమూర్తిగా వర్ణించబడ్డాడు (పుట 23). అతనికి పల్నాటి కృష్ణుడని మరొక పేరుంది. అతను వర్షంకోసం ప్రార్థించగా వర్షం కురిసిందట! బాలచంద్రుడూ అట్టివాడే! అతని వెనుకటి అవతారాలు లోహితాస్యుడు, అభిమన్యుడు, సిరియాళుడు, ప్రహ్లాదుడు, అంగదుడు, కుశుడు అట! ఎంతబాగుంది? బాలచంద్రుని పుట్టుకలోను విశేషముంది. తలిదండ్రులు సంతానంలేక నానా వ్రతాలు చేసేరు. చివరకు నిమ్మను నోమమని ఆకాశవాణి చెప్పింది. తల్లి, మరి కొందరును గజనిమ్మలను తబుకుల్లో పెట్టుకొని చెన్నకేశవస్వామికి సమర్పించగా, ఆయన ముఖం పడమటికి తిప్పుకొన్నాడట! స్త్రీలు ఆత్మహత్యకు సిద్ధపడగా స్వామి ప్రసన్నుడయేడు. గజనిమ్మముక్కలను అక్కడి స్త్రీలు సేవించేరు. వారికి వీరులు జన్మించేరు. బాలచంద్రుడు, అతని తమ్ములు ఇట్లు అతిలోకంగా జన్మించేరు. వారు బాల్యంలోనె స్వర్గాన్ని చేరుకొన్నారు.

బాలచంద్రుడు యుద్ధానికి వెళ్ళేటప్పుడు భార్య అనుమతిని పొందేడు. బంగారు తిమ్మరాజు, దేశింగురాజు కథలలో ఇట్లే జరిగింది. అసలు యుద్ధాన్ని గురించి బాలచంద్రుడికి బొంగరాలాటలో దెబ్బతిన్న అన్నమ్మ అను వేశ్యవల్ల తెలిసింది. బాలనాగమ్మ కథలోకూడ బాలవర్ధిరాజుకికూడ బాలనాగమ్మ చెరనుగురించి బొంగరాలాటలో దెబ్బతిన్న స్త్రీవల్లనే తెలిసింది.

జంగంకథలో ఒక దేవతా గుర్రం తప్పదు. కాబట్టి పెద్దనాయుడు అటువంటి మహిమగల గుర్రాన్ని ఎక్కి లొంగదీసేడు. ఈ కథలలో వేశ్యాపాత్ర వచ్చి తీరుతుంది. బాలచంద్రుడు సబ్బాయి అను వేశ్యతోఉండి చివరకు పశ్చాత్తాప పడ్డాడు.

ఈ గ్రంథంలో శకునాలలో నమ్మకం విశేషంగా కనబడదు. దుశ్శకునంగా పాపటబొట్టు తెగిందట (49).

దీనిలో అతిశయోక్తులు విశేషంగా కనబడతాయి. ధ్వని అను ఉద్దేశంతో చెప్పే మాటలకైనా ఒక మితం అవసరం! లేకుంటే అది పనికివచ్చే ధ్వని కాదు. బాలచంద్రుడు తన శక్తిని గురించి ఎట్లు వదరుతున్నాడో చూడండి -

బ్రహ్మాండమునుబట్టి బంతులాడుదును
మృత్యుదేవతనైన మెదిపివేసెదను
హరిహరుల్ మెచ్చగా

అని చేసిమించి అంటున్నారు.

బాలచంద్రుడు, అతని ఆరుగురు తమ్ములు కలసి లక్షలకొద్ది ఉన్న శత్రుసేనను ధ్వంసంచేసి పారేశారుట.

ఒక్కొక్క వీరుడె ఒక్కొక్క లక్ష
దళమును సమయింప నున్నారు!

కొమ్మరాజు బాణం విడవగా త్రిలోకాలు గడగడ వణికిపోయేయి. రామబాణాన్ని మించిపోయింది కదా! (పుట 36). నలగామరాజు హిందూదేశంలో ఉన్న రాజులందరకు, యుద్ధానికి సహాయంగా రమ్మని 'బాసపత్రికలు' రాసేడట! బాసపత్రికలంటే లేఖలన్నమాట! కాని వివిధ భాషలలో ఈ లేఖలుండవలసిన ఆవసరం ఉండడంచేత వీటికి బాసపత్రికలను పేరువచ్చి ఉంటుంది.

ఈ గ్రంథంలో ఏడు, పన్నెండు సంఖ్యా నియమాలు పాటించబడ్డాయి.

ఏడునుగురించి - బాలచంద్రుడు, అతని తమ్ములు ఏడుగురు.

ఏడు వేల ధనంబునింతికి నిమ్ము (69)
ఏడుజాములదాక నిచ్చటనుండు (40)

మాంచాల బాల్యం గురించి -

ఏడేళ్ళనుండి తానేమారనట్టి
వేశ్యా మోహంబు విడవనొనర్తు (63)

అంటుంది.

ఏడోకోట్ల ధనముంది (40)

పన్నెండును గురించి . . ఐ తమ్ముకు పన్నెండేళ్ళపాటు సంతానం లేదు.

కొత్త సంఖ్య ఒకటి కనబడుతూంది. అది అరవై ఆరో, అరవైఅయిదో తేలడంలేదు. 'అర్వదార్గురు వీరులందరియూన (97) అని ఒక చోట ఉంది. మరి కొన్నచోట్ల 65 అనికూడ ఉంది.

జంగంకథయొక్క ఒక లక్షణమేమంటే - కథంతటా కరుణ రసముంటుంది. ప్రధాన వీరులు మరణిస్తారు. మిగిలినివారు సుఖంగా ఉంటారు. పల్నాటి వీర చరిత్రకూడ అల్లే ఉంది. బాలచంద్రుడు, అతని సోదరులు యుద్ధంచేసి శత్రువులను సంహరించి, తాము మరణించేరు. వారు అసహాయశూరులు. శత్రువులు నాశనంకాగా మలిదేవరాజు దేశమంతటికి రాజయేడు, బ్రహ్మనాయుడు మంత్రి అయేడు. కాబట్టి ఇది సుఖాంతమయింది.

(సశేషము)

## కీ॥ శే॥ శ్రీమతి మాధవిఅమ్మగారు

కీ॥ శే॥ డాక్టరు కే. యస్. కేసరిగారి సతీమణి శ్రీమతి మాధవి అమ్మగారు 16-12-55నాడు ఉదయం 11 గంటలకు బంధు మిత్రుల దుఃఖ సాగరంలో ముంచి స్వర్గస్థులయినారు. ఆమె చని పోయేనాటికి 65 సంవత్సరముల వయస్సు. అంత్యఘడియలలో కుమార్తెలు శ్రీమతి శారదాదేవి, కుమారి వసంత, చెల్లెళ్లు, తమ్ముడు, వారి సంతతి, యితర ఆప్తబంధువులు దగ్గరనున్నారు. సాయంకాలం నాలుగు గంటలకు అంత్యక్రియలు జరిగినవి. వారి ఆచారప్రకారము 16 వ దినము కర్మ సందర్భమున విరివిగా అన్న వస్త్రదానములు జరిగినవి. కుమార్తెలు శారదాదేవి, కుమారి వసంతలకు మాతృవియోగ సందర్భమున అనేకులు సానుభూతి సందేశాలను పంపించారు.




**దేవవ్రతుడు (ప్రథమభాగము) : కుమారి సుందరి. ప్రచురణకర్త : శ్రీ టి. అప్పన్న యం. ఎ., మురారి బిల్డింగ్స్ బళ్లారి. వెల అర్ధరూపాయి.**

దేవవ్రతుని చరిత్రమును పద్యరూపముగా రచింపబడినది. రచయిత్రి వయస్సునందు పిన్నదైనను భారతీయ విజ్ఞాన విశేషముల ప్రచారము నుద్దేశించి రచించిన యీ పద్యరచన పండిత పామరుల ఆదరాభిమానములకు పాత్రము కాగలదని మా నమ్మకము.

**తెలుగుబిడ్డ : శ్రీ నల్లూరి వెంకటరత్నమాచార్యులు, గూడవల్లి, (వయా) భట్టిప్రోలు, గుంటూరు జిల్లా. వెల 0-6-0.**

ఇది బాలలకని ఉద్దేశించి సరళమైన శైలిలో ముత్యాలలాంటి అచ్చుకూర్పుతో రచించిన దీపద్యరచన. ఇందులో తెలుగు కవులను, వాఙ్మయాన్ని, సంస్కృతిని పరిచయంచేస్తూ, ఉత్సాహోల్లాలను పురికొలుపుతూ నీతులను చెప్పడానికి ప్రయత్నము జరిగింది. ఇట్టి గ్రంథాలు బాలబాలికల మనస్తత్వాల తీర్చి దిద్దడానికెంతైనా అనువైనవి.

**ఆర్థిక సమత - భూదానము - గ్రామ స్వరాజ్యము : శ్రీ గోరా. ప్రచురణకర్తలు : ఆర్థికసమతా సాహిత్య సమితి, పటమట, కృష్ణజిల్లా. వెల 0-6-0.**

ఇందులో మానవజీవితంలో అత్యంత ప్రధానమైన ఆర్థిక సమస్యను పరిష్కరించడానికనువైన మార్గాలు వివరించబడినవి. సమాజ పునర్నిర్మాణ సందర్భమున ఎదుర్కొనవలసిన సమస్యలు, దానికి మార్గాలు గ్రంథకర్తచే వివరింపబడినవి. ప్రజాసామాన్యము నిత్యావసరాలకు లోటులేకుండా ఆరోగ్య సౌభాగ్యాలతో, విద్యావిజ్ఞానములు కలిగి దేశానికి, ప్రపంచానికి సేవచేయ కలుగడానికి నిర్విరామంగా తలపోస్తూ, కృషి చేయ నుత్సహించువారికి యిట్టి గ్రంథాలు చాలవరకు మార్గదర్శకం కాగలవు.

**రామగోవిందరెడ్డి : శ్రీ సరిపల్లి శ్రీమన్నారాయణరెడ్డి. ప్రచురణ కర్తలు : హంపీసాహిత్య నిలయం, జొన్నపాడు, కృష్ణాజిల్లా, వెల 0-6-0.**

ఇది వీరపత్ని, వీరశేఖరులగు కొండపల్లి సీతమాంబ, రామగోవిందరెడ్డి దంపతుల పవిత్రగాథ. ఇందులో రామగోవిందరెడ్డి పౌరుష, పరాక్రమములు, పవిత్ర త్యాగము, సీతమ్మ పతిభక్తి, సౌశీల్యాలు చక్కగా వివరింపబడినవి. భారత జాతీయతను ప్రస్ఫుటింపజేసే స్వాతంత్ర్యపిపాస, ఆత్మ గౌరవము, దేశభక్తి, త్యాగములాంటి ఉత్తమ ధర్మాలను ప్రబోధించుచు యీ చరిత్ర పాఠకుల నుత్తేజపరచునదిగానున్నది.



# సంపాదకీయములు

## విద్యార్థులు–క్రమశిక్షణ

విద్యార్థులలో క్రమశిక్షణా లేమికి కారణములను పలువురు పలువిధములుగా వివరిస్తున్నారు.

రాజకీయ పక్షాలు స్వార్థమునపేక్షించి విద్యార్థులను తప్పుడు దారులలో నడిపించుట క్రమశిక్షణా రాహిత్యానికి కారణము అంటారు కొందరు.

మరి కొందరు ఉపాధ్యాయులకు, విద్యార్థులకు సన్నిహిత సంబంధ పరిచయములలోపము, దాని వల్ల విద్యార్థుల పురోభివృద్ధి పట్ల ఉపాధ్యాయుల ఆసక్తిలోటు, విద్యార్థులకు ఉపాధ్యాయులపట్ల భక్తి విశ్వాసాలలోటు, విద్యార్థులలో క్రమ శిక్షణ రాహిత్యాన్ని ప్రోత్సహిస్తున్నవని అభిప్రాయ పడుతున్నారు.

పై రెండు అభిప్రాయాలు యదార్థమయినవయినా సాంఘిక జీవిత ప్రభావముకూడ కారణమని చెప్పాలి! దాంతోబాటు లోపభూయిష్టమైన విద్యా విధానంకూడ.

తల్లిదండ్రులు తమ బిడ్డలను విద్యాభ్యాసానికి పంపడము అక్షరాలు, అంకెలుమాత్రం నేర్చుకోడానికి కాదని, విద్యా విజ్ఞానాలతోబాటు నిత్యజీవితంలో సుశిక్షణ తమ బిడ్డల కవసరమని గుర్తించాలి. తామెంత సంపన్నులయినా, గొప్పవారైనా విద్యావిజ్ఞానాలార్జించడంలోను, మంచినడత అలవరచుకోడంలోను, క్రమశిక్షణారహితంగా వ్యవహరించడం తల్లిదండ్రులు ప్రోత్సహించడం గొప్పపొరబాటు.

ఇక విద్యార్థులు నిజంగా విద్యావిజ్ఞానాల నార్జించడమే ప్రధానదృష్టిగా కలిగియుండాలి. విద్యార్థిగా ఏ శాస్త్రమైనా చదువవచ్చు. ఎంత విజ్ఞానమైనా సంపాదించవచ్చు. తను విద్యాలయంలో నున్నంతవరకు తన విద్య, విజ్ఞాన విశేషములు విద్యాలయం వీడగానే తనకు, తనసోదర ప్రజానీకానికి భవిష్యత్పురోభివృద్ధికి వినియోగపడేలాగ రూపొందుతుండాలి.

ఇక ఉపాధ్యాయులకు విద్యార్థుల విద్యావిజ్ఞానములపట్ల ఆసక్తివర్ధిల్లాలంటే ఆర్థిక దురవస్థ తొలగాలి. విద్యార్థులకు ఉపాధ్యాయులపట్ల భక్తివిశ్వాసాలు వర్ధిల్లడానికి ఉపాధ్యాయుల చిత్తశుద్ధి, సద్భావములు విశేషంగా నుపకరిస్తవి. విద్యార్థుల మంచిచెడ్డలను గురించి, అవసరానవసరములను గురించి ఉపాధ్యాయులు, విద్యావిధానము సద్భావంతో నిర్ణయించిననాడు విద్యార్థి రాజకీయాలంటూ యుండవు.

విద్యార్థులలో దుర్నడత, దురలవాట్లుతలలెత్త వీలులేనట్టిరీతిగా విద్యార్థుల తలిదండ్రుల సహకార సద్భావాలతో రూపొందిన క్రమశిక్షణ విద్యార్థులకు, విద్యార్థినులకు భావి భవిష్యత్ జీవితంలో మార్గదర్శకం కావాలి! అట్టి క్రమశిక్షణను పొందుపరచబడని విద్యా విధానము క్రమశిక్షణను విద్యార్థులలో పూరించలేదు.

ఇక రాజకీయ ఉద్యమాల ప్రభావం విద్యార్థులను ఆకర్షించేదైనా తాము విద్యార్థులుగా నున్నంత కాలం పార్టీ రాజకీయాలకు దూరంగా నుండాలి. విద్యావిజ్ఞానములార్జించి మంచిచెడ్డలను నిర్ణయించుకోగల స్థితిలో రాజకీయ జీవితం వాంఛనీయంకాని, అరకొర విజ్ఞానంతో మంచి చెడ్డలు తెలియకుండా రాజకీయాలలో వ్యవహరించడం చాలా ప్రమాదం. రాజకీయ జీవితంలోనైనా క్రమశిక్షణ అత్యవసరమను విషయం విదేశములను చూచైనా తెలిసికోవాలి!

## శ్రీ మన్మథనామ సం॥ర పౌష్య - మాఘమాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ జనవరి | 16 | సో | తృ 12.57 ధని 7.35 త్యా 4.15 పశువులపండుగ |
| | 17 | మం | చ 15.9 శత 11.11 |
| | 18 | బు | పం 16.20 పూభా 13 47 త్యా 4-6 |
| | 19 | గు | ష 16.14 ఉభా 15-8 కుమారషష్ఠి |
| | 20 | శు | స 14.52 రేవ 15 17 త్యాజ్యాభావః |
| | 21 | శ | అ 12.18 అశ్వ 14-15 |
| | 22 | ఆ | న 8.35 భర 12.7 |
| | 23 | సో | ద 3.54 ఏప్యం. 54.41 కృ 9.3 |
| | 24 | మం | ద్వా 5.27 రో 5.13 |
| | 25 | బు | త్ర 46.5 మృ 0 53 ఆర్ద్రా 55.24 |
| | 26 | గు | చతు 39.44 పున 51.41 కైలాసగిరిసేవ |
| | 27 | శు | ○ పౌ 33.42 పుష్య 47.27 |
| | 28 | శ | కృపా 28.13 ఆశ్లే 43.50 |
| | 29 | ఆ | వి 23.25 మ 41-1 త్యా 3.49 భానువిదియ |
| | 30 | సో | తృ 19.40 పూఫ 39.12 త్యా 3.58 గాంధీజీ ఆరాధన |
| | 31 | మం | చ 17.1 ఉఫ 38.32 కుజచతుర్థీజ్వాలాముఖయోగం |
| 1956 సం॥ ఫిబ్రవరి | 1 | బు | పం 15.35 హ 39.5 |
| | 2 | గు | ష 15.24 చి 40.49 దగ్ధయోగం |
| | 3 | శు | స 16.24 స్వా 43.44 త్యా 4.16 |
| | 4 | శ | అ 18.39 విశా 47.45 శూన్యతిథి |
| | 5 | ఆ | న 21.50 అనూ 52.35 |
| | 6 | సో | ద 25.50 జ్యే 58.6 అమృతయోగం |
| | 7 | మం | ఏ 30.23 మూల 60-10 త్యా 4.25 |
| | 8 | బు | ద్వా 35.13 మూల 4.5 సిద్ధియోగం |
| | 9 | గు | త్ర 40.3 పూషా 10-7 త్యా 4.24 |
| | 10 | శు | చతు 44.37 ఉషా 16.0 మాసశివరాత్రి |
| | 11 | శ | ● అమా 48.38 శ్ర 20.27 పిండపితృయజ్ఞం |
| | | | **మాఘ మాసము** |
| | 12 | ఆ | శు పా 51.52 ధని 26-15 మాఘస్నానప్రారంభం |
| | 13 | సో | విది 54.6 శత 30.10 హరిపద పుణ్యకాలం |
| | 14 | మం | తృ 55 9 పూభా 33.3 సిద్ధియోగం |
| | 15 | బు | ల 54.53 ఉభా 34-42 |

Printed & Published by Dr. S. Seshagiri Rao, at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




## చాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక చాలుచందా రు. 4-8-0. అర్ధసంవత్సరపు చందా రు. 2-8 0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడి కాపి ఆరు అణాలు. చందాదారులు ఏ మాసమునుండి యైన ప్రారంభము చేయవచ్చును. విడి కాపీలు వలయువారు వాని విలువ మేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయ మూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవల యును. కాలువుటకు తక్కువయైన ప్రకట నలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనా భ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహ ముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీక రింప బడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసము లందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామా మార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీ సులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలు పనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తర ములు మానేజరు, గృహలక్ష్మి, రాయ పేట, మదరాసు అను చిరునామాకే వ్రాయ వలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

---

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

భారత పశస్తి

THE PRIDE of INDIA




# LODHRA

FOR LADIES' HEALTH

KESARI KUTEERAM LTD., MADRAS

EASTERNS. 304

లోధ్ర

ఆరోగ్య భాగ్యానికి